# నాలంద


రచయిత

వావిలాల సోమయాజులు, బి. ఏ.,



ది ఓరియంట్ పబ్లిషింగ్ కంపెనీ, (రిజిష్టర్డు)

మద్రాసు :: తెనాలి :: సికింద్రాబాదు

కాపీరైట్ ] 1950 [ వెల : రు [illegible]

# తొలిపలుకు

ఆదర్శవిద్యార్థి జీవితకథను వస్తువుగా గ్రహించి నవలా రూపమున పుట్టిన గ్రంథము లాంధ్రభాషలో నపరూపములుగ నున్నవి. 'నాలంద' యట్టి యత్నములలో నొకటి. శిక్షాశీలతకర్హ యను నుత్తమ విద్యార్థిజీవిత మిందు చిత్రితము.

ప్రాచీన భారతదేశమున 'నాలంద' యుత్తమ విశ్వవిద్యాలయముగ ప్రఖ్యాతి గడించుకొనినది. ఆ విశ్వవిద్యాలయ వాతావరణమును స్వీకరించి యుత్తమ విద్యార్థి జీవిత కథాకల్పన మీ 'నాలంద'లో నొనర్ప యత్నించితిని. క్షమాది యుత్తమగుణ ప్రభావమువలన విద్యార్థులెట్లుపాధ్యాయులకు వశ్యులై వారి యాదరానురాగములతో నుత్తమ వ్యక్తులుగ పరిణమించి విద్యాస్వీకరణ మొనర్చిన సంస్థను క్రమశిక్షణము వలనను, నున్నత నీతివలనను జగత్ప్రసిద్ధముగ కావింప సమర్థులగుదురో యీ యాఖ్యాయికయందు నిరూపితమైనది.

ఈ కథారచనమున కావశ్యకములైన చారిత్రకాంశములను సాంక్లియా మహాశయుని 'నాలంద విశ్వవిద్యాలయ' మను పరిశోధన గ్రంథమునుండి నేను స్వీకరించితిని. ఫారార్ మహాశయుని 'సెయింట్ వినిఫ్రెడ్సు' బృహత్కథాపఠనము నా యాఖ్యాయికారచన కుద్బోధకము.

ఈ నవలను వారి గ్రంథమాలలో నొక కుసుమముగ గైకొని నన్నభిమానించి ముద్రణాస్థితిని గల్పించిన ఓరియన్ట్ పబ్లిషిజ్ కంపెనీ యజమానులగు శ్రీ. యం. యస్. శర్మగారికి నేను సర్వదా కృతజ్ఞుడను.

—ర చ యి త

# నాలంద

## ౧

"సఖీ! నేఁడు శుభదినమైనది. నాలంద పవిత్రఘంటిక బుద్ధపూజకై యందఱఁ బిలుచుచున్నది. మనము త్వరితముగ ప్రవేశించి, చైత్యగృహమున కేగి యందుఁ బాల్గొందము"

నాలంద విద్యాలయ బహిఃప్రదేశమునం దుత్తరద్వారమున సాశ్వశకట మాఁగినది. అందుండి చంద్రశ్రీశాతకర్ణి పదునైదు వత్సరముల బాలుని చేయూత నిచ్చి దింపినాఁడు.

చంద్రశ్రీ పూర్వ మొక శతాబ్ది కాలము మగధసామ్రాజ్యము నేకచ్ఛత్రముగ పాలించిన శాతవాహన వంశమున జన్మించిన రాజపుంగవుఁడు. ఆసామ్రాజ్యము పతన మొందిన పిమ్మట వారి వంశస్థులు గౌతమీపుత్రశాతకర్ణి నేతృత్వమున దక్షిణాపథపతులై మహత్తర వైభవముతోఁ రాజ్యపాలన మొనర్చినారు.

గౌతమీపుత్రశాతకర్ణికి సవతితమ్ముఁడు మేఖలశాతకర్ణి. ఇతఁడు మహావీరుఁడు. పాటలీపుత్ర ప్రాంతమును స్వశక్తితో రక్షించుకొని బహుకాలము పాలించినాఁడు. అతనికిఁ బదియవ తరమువాఁడే యీ చంద్రశ్రీశాతకర్ణి.

శిఖి చంద్రశ్రీశాతకర్ణి ప్రథమపుత్రుడు. సుగుణరాశి, స్ఫురద్రూపి. తండ్రి యతని బాల్యమునుండి గారాబముతో బెంచినాడు. విద్యాబుద్ధులు గరపుటలో గూడ శ్రద్ధ వహించినాడు. అది క్రమబద్ధమైనది కాదు; కాని శిఖి శ్రద్ధతో గొంత విద్య గడించినాడు. అతని వయస్సులో నున్న నాలంద విద్యాలయ విద్యార్థులకంటె నతడు విజ్ఞాని. అయినను వారు పొందిన విద్యకును, శిఖి స్వీకరించిన విద్యకును విశేష విభేదమున్నది.

స్వార్థ మెరుగని యుత్తమాచార్యుల సేవాత్యాగముల ఫలితముగ నాలంద విఖ్యాతి యుత్తరాపథమున దశదిశల వ్యాపించుచున్నది. కుమారు నుత్తమధర్మవీరునిగ, సుదాత్త మానవునిగ దీర్చి దిద్దుటయే జీవితాశయముగ నెంచుకొనుచున్న చంద్రశ్రీని యాకీర్తి యాకర్షించినది. కుమారు నావిద్యాలయమున నుత్తమాచార్యుల కడ జదివించుట యుక్తమని తలపోసి నేడతని నందు బ్రవేశపెట్టుటకు దీసుకొని వచ్చినాడు.

వారు దీర్ఘప్రయాణ మొనర్చినారు. కాని విసుగు జనింపలేదు. నిరంతర సంభాషణతో చంద్రశ్రీ కుమారుని కనేక విషయముల దెలియజెప్పినాడు. సందర్భవశమున శిఖి తండ్రిని నాలంద యన నేమని ప్రశ్నించినాడు. 'న-అలమ్-ద' పూర్ణముగ నిచ్చునది కాదు. విద్యార్థులకు జీవిత మార్గమును జ్ఞాపించి విడిచి పెట్టినది. 'ఇదియే విద్యాలయమునకు బరమ ధర్మ'మని తండ్రి కుమారునికి జెప్పినాడు.

"నాలందలో నాచార్యులు, నుపాధ్యాయులు విజ్ఞాన మహో దధులు. వారి విద్యాగర్భముల నెన్నెన్నో రత్నరాసు లున్నవి. వానిని సేవించి వాటిని గ్రహించుటయే విద్యార్థుల కర్తవ్యము." అని చెప్పి యందున్న రత్నోదధి, రత్నసాగర, రత్నరంజక గ్రంథాలయముల గురించి చంద్రశ్రీ ప్రస్తావించినాడు. అందలి యాలయముల, విహారముల, విద్యామందిరముల స్వరూప మును గోచరింప జేసి కుమారున కతదాసక్తి గల్పించినాడు.

ఉన్నత శిఖరముపైనుండి శకటము దిగుచున్నప్పుడు దూర ముగ గన్పించిన నాలందను జూపించుచు "ప్రకృతి హృదయ దేశమున పసిపాపవలె నున్న యీ విద్యాలయ మెంత రమ ణీయముగ నున్నది? ఈ ప్రశాంత వాతావరణమున సత్సాం గత్యమును బొంది శ్రద్ధాభక్తులతో విద్య నార్జించి యుదాత్త మూర్తివై నీవు తిరిగి వచ్చుటయే నా చిరకాల వాంఛ" యని పలికినాడు.

"శక్తివంచన లేక శ్రమించి మీ కోరిక నీడేర్చెదను". అనురాగమునకు పాత్రుడ నౌటకే యత్నింతు" నని శిశు శాతకర్ణి చంద్రశ్రీకి సమాధానము జెప్పినాడు.

త్వరిత గమనమున చైత్యగృహమును జేరుకొని బుద్ధపూజా నంతరము చంద్రశ్రీ కుమారు లిరువురు నాలంద ప్రధానాచార్యుడు శీలభద్రుని ప్రత్యేకమందిరమును జేరుకొనినారు. ఒక యున్నత వేదికపై కూర్చొని యతడు గ్రంథపఠన మొనర్చుచున్నాడు. చంద్రశ్రీ కుమారునిచే నాచార్యునకు పాదాభివందనము జేయించినాడు.

అవసరోచిత సంభాషణలు సాగినవి. శిఖిని శీలభద్రుడు విద్యార్థిగ స్వీకరించి 'నీ కాచార్యుడు కాశ్యపుడు, గయాశీర్షు డుపాధ్యాయుడు' నని చెప్పి వారిని బంపించినాడు.

ఆదినమే సాయంత్రము చండశ్రీ మజిల నింటికి బ్రయాణ మైనాడు. నాలంద ప్రథమ ప్రాకార ద్వారమువరకు ననుసరించి వచ్చిన కుమారునకు బుద్ధులు గఱపి శకటముపై నధిరోహింప బోవుచు 'శిఖీ! మన వంశగౌరవమును, బేరుప్రతిష్ఠలు నీవలన నిలువ వలసి యున్న' వను వాక్యము శిఖి హృదయమున గాఢముగ హత్తుకొనినది. 'భద్ర'మని పలుమారులు పలికి కుమారుని నిలువు మని యాజ్ఞాపించి చండశ్రీ శకటమును సాగించి నాడు. కనుజూపున కందునంతవఱకు ననురాగముతో జూచి శిఖి శాతకర్ణితండ్రి నుద్దేశించి కరాంజలి ముకుళించి వెను దిరిగి వచ్చినాడు.

కామాయినీ భిక్షుకిని శిఖిశాతకర్ణికి వినయ విహారమున నివాసగృహకక్ష్య జూపించినది. వస్తువులకు స్థాన సంగ్రహ మొనర్చు కొని యనుగుణముగ వాని నమర్చుకొనినాడు. విశేషము లేమియు లేక నాదినము గడచినది.

మరుసటి దినమున ప్రభాతవేళ మేల్కొని కాలకృత్యముల దీర్చుకొని బుద్ధపూజానంతరము శిఖి విద్యామందిరమున కరిగి నాడు. విద్యార్థు లొనర్పవలసిన కార్యపత్రిక 'ప్రతిమోక్షము'ను శ్రద్ధగా బఠించినాడు.

చదరలపై గూర్చుండి విద్యార్థులు ముచ్చటలు జెప్పుకొనుచు కాలక్షేప మొనర్చుచున్నారు. ప్రాత విద్యార్థులకు నూతన

ముగ బ్రవేశించువారిని బేరులుపెట్టి యాటలు బట్టించుట పరిపాటి. శాతకర్ణి కక్ష్యలో విజితావి యట్టివారిలో నేటి. శిఖని జూచిన తక్షణమే "ఏమోయి 'ఎఱ్ఱతేలు !' నీపే రేమి ?" టని ప్రశ్నించినాడు. అది కేవలము ధూర్తత. శాతకర్ణి జంక లేదు. నిశ్చలముగ 'శిఖ' యని సమాధానము జెప్పినాడు. అతని సంబంధ బాంధవ్యముల దెలిసికొనిగాని యేడ్పింపరా దని నిశ్చయించుకొని విజితావి శాతకర్ణిని జేరబిలచి విచారించినాడు. అతని యొద్దనుండి విలక్షణమైన సమాధానములు వచ్చినవి. విజితావి కాశ్చర్యము గలిగినది. అయిన దానిని బహిరంగ మొనర్పక నూతనముగ వచ్చిన మరియొక విద్యార్థి కుబ్జునకు, శాతకర్ణికిని 'కజ్జము'ను గల్పించి యానందింప దలచి యిరువురను గవ్వించినాడు.

వారికి రోషము హెచ్చినది. కుబ్జుడు విజితావి యిచ్చుచున్న స్తోమతను జూచుకొని శిఖ ముఖముపై నొక దెబ్బకొట్టినాడు. ప్రతిగ నతడు చేయినెత్తిబోవ 'చిన్నవానిపై జేయిచేసుకొనుచున్నావా ?' యని విజితావి బెదరించినాడు.

"క్రొత్తగ జేరిన వారికి 'పుల్లింగములు' పెట్టి పోరాడించి యానందించుట సిగ్గుచే"టని దూరముననుండి చూచుచున్న మంగళుడు విజితావిని నిందించినాడు.

"పిరికివాడు; వా డేమి పోరాడు" ననుచు కుబ్జుడు శాతకర్ణి మీదికి తరుముకొని యొంటికాలిపై వచ్చుచున్నాడు.

"నేను నీతో తలపడ' నను శాతకర్ణి మధురకంఠస్వరము విద్యార్థుల నెందులకో యాకర్షించినది. మంగళుడు ముందుకు

వచ్చి 'కారణ మే' మని ప్రశ్నింప శిఖ యిట్లు సమాధానము చెప్పినాడు.

'కారణము లేనిదె కలహ మెందులకు? అయిన నాచిన్న వాడు నాకు 'డజ్జీ' కాడు.' కొందరు బాలకు లతని యుదాత్తతను గుర్తించి గౌరవింప నారంభించినారు. విజతావి యతని సమాధానముల సహింపలేకున్నాడు. అత డూరకొనలేదు. డజ్జీ యానో కాదో పోరాడిన గాని తెలియదు. ఇది 'యాడ లేక మద్దెల యోడన్న' ట్లున్నది. "ఒడ్డు పొడుగును జూచి మాకుబ్జుడు భయపడు ననుకొనినా వేమో! వాడు నీవలె పిరికిపంద కాదు. కుబ్జా!" అని యతడు పురియెక్కించినాడు.

విజతావి యండజూచుకొని కుబ్జుడు శాతకర్ణి ముక్కుపై నొకదెబ్బ కొట్టినాడు. అతనికి బట్టరాని కోపము వచ్చినది. తగిన శాస్తి యొనర్పవలె నని ప్రథమమున నూహపొడమినది. మఱల మనస్సును జిక్కబట్టుకొని కుబ్జుని వల్లెవాటుగ రెండు చేతులతో నెత్తుకొని, యతని పాదతాడనముల లెక్కింపక కక్ష్యలో నొకమూల గూర్చుండబెట్టి 'మిత్రుడా! మూర్ఖుడవు గాకు' మని బుద్ధిజెప్పినాడు.

అతనిరక్త ముడుకెక్కి యున్నది. సూటిగ విజతావి దగ్గరకు దిరిగివచ్చి "ఏమంటివి? నేను పిరికిపందనా? కాను. కాని వ్యర్థకలహము లన్న నాకపేక్ష లేదు. మిత్రుడా! నీవు మాటకారి నని మనమున సంతోషించుచున్నట్లున్నావు. దాని వలన నీకే ప్రమాదము. నిన్ను జూచి నే నణుమాత్రమైన వ్యాకులతనొంద' నని ఖండితముగ బలికినాడు.

'అయిన నాతో గలహింపుము'

విజితావి మండిపడి శిఖపై తలపడి దక్షిణశ్రవణముపై నొక దెబ్బ కొట్టినాడు. అతడు మరుక్షణమున శక్తికొలది విజితావి యుత్తరశ్రవణముపై దాని నొప్పజెప్పినాడు. విజితావి గూబ గింగురు మనినది. ఆదెబ్బతో నతని దయ్యముపారినది. మరల నతడు తూలలేదు. పగసాధింప నిది సమయము గాదని యూరకొనినాడు.

"శక్తియున్న ముందునకు రమ్ము. పిరికివాడు నీవా నేనా? అట్లు మరెన్నడు ననకుము. జాగరూకతతో మెలగుము" అని గట్టిగ గద్దించి పలికినాడు.

ఇంతలో విద్యార్థు లుపాధ్యాయ కాశ్యపుడు మందిరమునకు వచ్చుచుండుట గమనించి వారి స్థానముల గుక్కిన పేలవలె గూర్చొనినారు. శాతకర్ణి యౌదార్య ధైర్య సాహసములకు ముగ్ధులై మంగళుడు, ధ్వజకేతువు నతనితో మైత్రి గావింప నిశ్చయించుకొనినారు.

౨

ప్రప్రథమముననే శాతకర్ణికి మంగళుని స్నేహములభించినది. అతనివలన నతడు విద్యార్థుల లక్షణములు, నాలందా విద్యా ప్రదానవిధానము, నాచార్యపాదుల స్వరూపస్వభావములను, విద్యావైదుష్యములను దెలుసుకొనినాడు. అత డొక యా

చార్యుని పర్యవేక్షణక్రింద నొక కక్ష్యలో విద్యామందిరమున మరికొందరు విద్యార్థులతో గలసి విద్యనేర్చుకొనవలెను. పది మంది విద్యార్థులతో నొక నివాసగృహకక్ష్యలో వసించి నిద్రింపవలెను. అయిన నత డింతకు బూర్వ మిట్టి విద్యకుగాని, నివాసమునకుగాని యలవాటుపడినవాడు కాడు.

'ఆచార్యపాదులు నిన్ను బరీక్షించినారా ?'

'లేదు ! శీలభద్రులు నన్నేమేమి జదువుకొనినావని యడిగినారు. నాసమాధానములు విని కాశ్యపుల గలుసుకొని వారి యొద్ద విద్య నభ్యసింపు మని యాదేశించినారు.'

'కాశ్యపుడా!' యని ధ్వజకేతువు ముఖము చిట్లించినాడు. 'వారెటువంటి వా' రని శాతకర్ణి ప్రశ్నింప "ఆయన మనిషి కాడు. కేవల మొక యంత్రము. నేనును మొదట కొంత కాలము వారికడ జదివినాను. అప్పుడు నాజాతకమున శని బాగుండ లేదనిపించిన"దని ధ్వజకేతువు వ్యంగ్యముగ బలికినాడు.

" ఛీ ! నోరుమూసుకొనుము. ఆచార్యపాదుల గురించి యవ్యక్తముగ మాటాడుట యనుచిత మని యతని సంభాషణమును మాన్పించి మంగళుడు శాతకర్ణితో నిట్లనినాడు.

"మిత్రుడా! తినబోవుచు రుచి యడుగనేల ? వారి సద్గుణములు స్వల్పకాలములోనే నిన్నాకర్షించు నని నావిశ్వాసము. నీ యుపాధ్యాయు లెవరు ?"

"గయాశీర్షులు".

మరల కల్పించుకొని ధ్వజకేతువు 'గయాశీర్షులా?' యని యాశ్చర్యమును వెలిబుచ్చి నాలుక కొరికినాడు. బాగున్నది. ఇరువురు మహాత్ములును తగ్గవారు దొరికినారు అనినాడు.

"వారి స్వభావ మెట్టి?" దని శిఖ శాతకర్ణి మంగళుని ప్రశ్నించినాడు.

"నీవు వినయవిధేయతలతో సక్రమముగ ప్రవర్తించి సకాలమునకు పాఠముల నల్లించిన నాయన నీజోలికి రాడు. నిన్ను దయతో పాలించును. ఆయనకు మాంద్యము గిట్టదు; చిలిపితనము సహింపలేడు. అట్టి విద్యార్థులతో మాటాడుటకైన నిష్టపడడు; అసహ్యించుకొనును". అని మంగళుడు గయాశీర్షుని స్వభావమును విశదపరచినాడు.

"అదుగో! ఆమ్రచెట్టు నీడలో 'పృథువుల'తో మాటాడుచున్న వ్యక్తి గయాశీర్షుడు" అని ధ్వజకేతువు నూతన మిత్రుని కలసి యుపాధ్యాయుని జూపెంచినాడు. శిఖ యాయనను గుర్తుపెట్టుకొనినాడు.

విద్యాలయ ఘంటిక మ్రోగినది. కట్టలు దెగిన క్రొత్తనీరు వలె విద్యార్థులు విద్యామందిరములోని వివిధకక్ష్యల నుండి బయటపడి నలుదెసలకు పోవుచున్నారు. మంగళుడు నూతన మిత్రునితో నతని నివాసకక్ష్యకేగి మరికొంతసేపు సస్నేహముగ ప్రసంగించినాడు.

సాయంసమయమున కొందరు విద్యార్థులు చెట్లనీడలలో మరునాటి పాఠముల 'చింతన' జేయుచున్నారు. శాతకర్ణి సహపాఠుల గమనించినాడు. వారు గుంపుగజేరి సంభాషించుకొను

చున్నారు. అందువలన దనకు బాంధవులు లేనందు నుద్దేశము తో మంగళుడు వెళ్ళిన తరువాత నతడు వెంట దెచ్చుకొనిన గుణాఢ్యుని 'బృహత్కథ' జదువుకొనుచున్నాడు. ఇంతలో మిత్రుడు ధ్వజకేతువు వచ్చినాడు. శాతకర్ణి యతని మేలు ప్రశ్నలడుగ వలసి యున్నది; ఆరంభించినాడు. బహుకాలము సంభాషణ సాగినది. మంగళునివలె నతడును శాతకర్ణి కాప్తమిత్రుడైనాడు.

బుద్ధపూజకు ఘంటిక మ్రోగినది. విద్యార్థులందరును చైత్య గృహము వైపున కేగుచున్నారు. ధ్వజకేతువుతో గలసి శాతకర్ణి బుద్ధపూజలో పాల్గొనినాడు. భోజనానంతరము వసతి గృహ కక్ష్యలకు వచ్చి విద్యార్థులందరును నిద్రకు సిద్ధపడినారు.

శాతకర్ణికి ప్రయాణపు బడలిక యింకను దీరలేదు. గాఢనిద్ర మూలివచ్చినది; నిద్రపోవ నారంభించి యెంతోసేపు కాలేదు. అతని మంచము క్రిందికి బైకి లేచిపడుచున్నది. మేల్కొని యతడు నిదురమత్తులోనే మంచము క్రిందకుదూరి యొకని కాలు గట్టిగపట్టుకొనినాడు. కాలు జాడించి యవతల వ్యక్తి తప్పించుకొని పారిపోవుచున్నాడు. అతని పాదరక్ష శిఖ చేత చిక్కినది. వెంటబడి యతనిని చీకటిలో తరిమికొట్టినాడు.

ప్రక్కనున్న వసతిగృహ కక్ష్యలోనుండి అమితాభుడు వెక్కి వెక్కి రోదించుకంఠము వినిపించినది. అతని నట్లే యెవరో నిద్రనుండి లేపినారు. అతడు భయస్థుడు. గడగడ వడకుచు గట్టిగ బోరగిలబడి ప్రక్కను గావలించుకొని మధ్యమధ్య వెరపుచే కలవరించుచున్నాడు. ఆదుష్కృత్య మొనర్చిన

మాంజిష్ఠుడే మంచముపై నతని తిరిగి బరుండబెట్టి తనకక్ష్య కేగి శయ్యపై జేరినాడు.

ఆవాస గృహపాలిక అళిందమున మేల్కొని కాగడాచేత నొక పూటు నటునిటు తిరిగి నిశ్శబ్దముగ సంచారట గమనించినది; మరల గృహమున కేగి నిద్రించినది.

'ఈదినమునకు నీ కీశాస్త్రి చాలును. నీవిక నిద్రపొమ్ము'. అని యొకకఠిన కంఠస్వరము శాతకర్ణిని హెచ్చరించినది. కాని యతనికి గొంతసేపటి వరకు నిద్రపట్టలేదు. తనలో తాను ప్రసంగిపోవుచు దుఃఖించుచున్న అమితాభుని గురించి యత డాలోచించుచున్నాడు.

నిశ్శబ్దముగ నత డమితాభుని కక్ష్యలో ప్రవేశించి యను రాగముతో నిట్లనెను. 'మిత్రుడా! భయపడకుము. ఎవరో విద్యార్థి చిలిపితనమున నీపరిహాసకృత్య మొనర్చినాడు. మరి యొక రాత్రి యిట్టి పనిక బూనుకొనిన ప్రక్కనె నొకదుక్కన కొఱుగుము. అందువలన నీ కెట్టివిధమైన బాధయును గలుగదు'.

'నీవు దయగలవాడవు. నీవంటి వ్యక్తి నాకీనాలందలో గనుపంపలేదు. నెచ్చెలీ! నీపేరేమి?'

'శిక్షశాతకర్ణి' యని యతడు సమాధానము జెప్పినాడు, అమితాభుడు శిక్షని గౌరవపురస్సరముగ బంపించి మరల శయ్యపై జేరినాడు.

బ్రాహ్మీముహూర్తమున నాలంద ఘంటిక మ్రోగినది. విద్యార్థు లందరును మేల్కొని కాలకృత్యముల నిర్వర్తించినారు.

వారు బుద్ధపూజకై చైత్యాలయమును జేరుకొన సిద్ధపడు చున్నారు.

శిఖిశాతకర్ణి యొద్ద కొక విద్యార్థి దూకుడుగ వచ్చి "ఓరీ! క్రొత్తకుంక! నీయొద్ద నాపాదరక్ష యున్నదా? యని ప్రశ్నించి నాడు.

"అవును ఉన్న"దని యతివినయముతో నతడు బలికినాడు.

క్రోధరసము వెళ్ళగక్కుచు 'ఇటు తెమ్ము' అని వాడు శాసించినాడు. 'రాత్రి నామంచము క్రింద దూరిన యొక దుష్టుని కాలినుండి దానిని నేను లాగుకొనినాను.'

'రాత్రి నీ వేమొనర్చినావో జ్ఞప్తి యున్నదా?'

"అవును, పాదరక్షలతో నావ్యర్థునకు బుద్ధిచెప్పినాను. మరల నొక మారట్లే యొనర్చిన నత డుచిత 'గౌరవమును' బొంద గలడు." అని శాతకర్ణి సమాధానము జెప్పినాడు.

"అబ్బో! వీడుడ నీనాటికి క్రొత్తగ నూడిపడినావు! తా దూర నొక క్రంత లేదు; మెడలో డోలన్నట్లు నీ వా అమి తాభుని బుజ్జగించుచున్నావట! జాగ్రత్త" అని ఏకశృంగుడు పాదరక్ష పైకెత్తి శిఖిని గొట్టబోయినాడు. అతడు గట్టిగ నా దుష్టుని జేయిబట్టుకొని మెలిద్రిప్పినాడు. బాధను దాళజాలక ఏకశృంగుడు హస్తమునుండి పాదరక్షను గ్రిందబడవేసినాడు.

'సరె కానిమ్ము, ఇది సమయముగాదు. నేను బుద్ధపూజ కేగవలె' నని సాకుజెప్పి యతడు వెళ్ళిపోయినాడు.

అమితాభుని గలుపుకొని శిఖిశాతకర్ణి బుద్ధపూజ యొనర్చి తిరిగి విద్యామందిరము జేరుకొనినాడు.

"శిఖీ ! మన మెక్కడికి కేగవలెను"?

"నేనును క్రొత్తవాడను. నాకును దెలియదు." వారిరువు రకును దూరమున మంగళుడు కనిపించినాడు. అతనిని బిలచి ప్రశ్నింప నాతడు వారికి కాశ్యపు విద్యామందిరమును జూపించినాడు. ఇరువురు మిత్రులును నటకు జేరుకొనినారు.

కంఠస్థ మొనర్చిన పాఠములు విద్యార్థులు గయాశీర్షునకు వినిపించుచున్నారు. శాతకర్ణి వంతు వచ్చినది.

"క్షమింపుడు. నేను క్రొత్తవాడను. గ్రంథము లేదు."

"క్షమింపుడు. క్రొత్తవాడను. గ్రంథము లేదు" అని యా యుపాధ్యాయుడు శిఖిని వెక్కిరించి యధికారపూర్వకముగ రేపటికి వినిపింపకున్న నూరుకొనను. ఆదిలోనే హంసపాదా ? ఈనాటి పాఠము లన్నియు ఫలకముపై వ్రాసిజూపింపు' మని కఠినముగ శాసించినాడు.

'చిత్త' మని నమస్కరించి శాతకర్ణి యథాస్థానమున గూర్చొనినాడు.

అది శుక్లపక్షమే; కాని శాతికర్ణికి కృష్ణపక్షమువలె నున్నది. పూర్వ మాతడు కంఠస్థమొనర్చుట కలవాటుపడలేదు. వ్యాకరణమనిన నతనికి వెగటు. అతని మూలపురుషులలో నొకడైన హాలశాతకర్ణి సంకలన మొనర్చిన 'సప్తశతి'లోని గాథలన్న నతని కభిమాన మధికము. వానినే యతడు ముఖస్థ మొనర్ప

లేదు. నాలందలో వ్యాకరణమునకు విశేషప్రాధాన్యము. శబ్దార్థ వివరణమున సమస్తప్రపంచములో విద్యార్థులకు బరిచయ మొనర్చు నవకాశము గలుగును. అందువలన దానికాచార్యులు ప్రథమస్థాన మిచ్చినారు. నాలంద విద్యావిధానము శాతకర్ణికి నచ్చలేదు. మనస్సు వ్యాకులపడ జొచ్చినది. అతని సంతృప్తి యారంభించినది.

విద్యార్థు లెవరైన పాఠముల ముఖస్థమొనర్చి వినిపింప లేకున్న గయాశీర్షునకు మరుసటిదిన మొప్పజెప్పిన జాలదు. వారిచే ఫలకముపై వానిని వ్రాయించును. పెట్టిన గడువులో వ్రాసుకొని రాకున్న మరల మరల వ్రాయించును. అట్టి విద్యార్థుల నాటపాటలలో బాల్గొన నీయడు. ఆయన విధానమునకు మార్పులేదు; విద్యార్థుల శక్తిసామర్థ్యముల గమనించిగాని, వారి మానసిక స్థితిగతుల బరిగణించిగాని యది పరివర్తన నొందదు.

చింతన యన శాతకర్ణి మనస్సు చెప్పినమాట వినదు. అతడు పదిమందిలో గలసి చదువుట కలవాటుపడలేదు. నిశ్శబ్దమున గాని యతని చిత్తము నిశితముగ బనిచేయదు. అతడు సకాలమున కొక్కమారైన పాఠముల బూర్తిగొనర్ప లేకపోవుచున్నాడు. నిరంతరమును వల్లింపలేని పాఠముల జూచి వ్రాయుటలో నతని కాల మంతయు వ్యర్థమగుచున్నది. గయాశీర్షు డతని 'నిరర్థకు' డని నిర్ణయించి శీలభద్రునితో విన్నవించినాడు. ఆసంగతి చెవినిబడిన తరువాత శిష్యు చిత్తము పరిపరి విధముల బరితపింప నారంభించినది.

ఆనా డతడు కక్ష్యలో వేదికపై నేకాంతముగ గూర్చుండి దీర్ఘముగ నాలోచించుచున్నాడు. అతని ముఖమున దైన్యము తొణికిస లాడుచున్నది.

విద్యార్థు లందరును కనుల యెదుట క్రీడాభూమిలో కందుక కేళి కాయత్తపడుచున్నారు. మంగళుడు, ధ్వజకేతువు శిఖిని బిలుచుకొనిపోవ నతని కక్ష్యకు వచ్చినారు.

"ఆటలో నీవు పాల్గొనుట లేదా ?"

"లేదు. పాల్గొనవచ్చు నని తెలియదు." "ఇప్పటికైన మించిపోయినది లేదు. కామాయినీ భిక్కునికి జెప్పి నీపేరును జేర్పింతెము రమ్ము" అని శాతకర్ణి నుత్సాహపరచి వారిరువురు నతనితో క్రీడాభూమిని జేరుకొని రంగస్థలమున బ్రవేశించినారు.

ధ్వజకేతు వొక పక్షమునకు, ఏకశృంగు డొక పక్షమునకు నాయకులు. 'జాగ్రత్తగ నాడవలె సుమా! మనలో నొకరైన మరణింపరాదు'. 'మాశక్తికొలది యత్నింతు' మని మంగళుడు, శాతకర్ణి యతనికి సమాధాన మిచ్చినారు.

కందుకక్రీడలో రెండుపక్షము లుండును. నేలమీద చిన్న గుంటను ద్రవ్వి దానియొద్దనుండి యొక పక్షమువారు విసరు చెండును మరియొక పక్షమువారు కోలతో గురితప్పక గొట్టవలెను. ముమ్మారు తప్పిన నాపక్షమున నొక రొకరే మరణింతురు. రెండవ పక్షమువారు కందుకమును వారిలో వారి కందించుకొనుచు గుంటకు కొంతదూరమున నిల్పిన కోలకు దగులు నట్లు వేయవలెను. తగులకున్న మరలను జెండుకొట్టు

దుసు. తగిలిన, వారిలో నొకరు చనిపోయినట్లు. ముగ్గురు గురి పెట్టి చెండు కొలకుదగులునట్లు కొట్టలేకున్న ప్రతిపక్షమున మరణించిన వారొకరు జీవింతురు.

చెండును గొట్టుట ధ్వజకేతువు పక్షమువారికి వచ్చినది.

ఆట ప్రారంభమైనది. కొలది కాలములోనే ధ్వజకేతువు పక్షమున మంగళుడు, శాతకర్ణి, యతడు తప్ప నందరును మరణించినారు. మంగళుడు కొలకు గుంటయొద్ద నిలిచి యిరువుర బ్రతికించినాడు. కాని వెంటనే వారు మరణించినారు. తరువాత మంగళుడు ధ్వజకేతువు మరణించినారు.

ఆట యంతయు శిఖిపై నాధారపడి యున్నది. అతడు కందుకమును జుక్కలు జూచునట్లు కొట్టినాడు ఏకశృంగుని పక్షము వారు పరుగెత్తి దానిని పట్టుకొనుటలో శ్రమపడి యలసిపోవుచున్నారు. వారి గురి తప్పిపోవుచున్నది. శాతకర్ణి క్రమముగ నందర బ్రతికించినాడు. ధ్వజకేతువు పట్టరాని సంతోషము గేకలు పెట్టినాడు.

సూర్యాస్తమయ మైనది. ఆట చాలింపు డని కామాయినీ భిక్కుని యాదేశించినది. ధ్వజకేతువున కాదిన మాటలో నఖండ విజయము. ఏకశృంగుని పక్షము పూర్వ మెన్నడు నట్లోడిపోలేదు. శాతకర్ణిని మంగళుడు, ధ్వజకేతువుభుజములపై నెక్కించుకొని కొందఱు విద్యార్థుల హర్షనినాదములతో నాలంద వీథులం దూరేగించినారు.

## ౩

క్రీడారంగమున నత డెంతటి ప్రజ్ఞ జూపించిన నేమి? శాతకర్ణి విద్యావిషయికముల వెనుకబడి యున్నాడు. అతని కాత్మగౌరవము లుప్తమగుచున్నది; నిరాశ యతని గలత బెట్టుచున్నది. గయాశీర్షు డొసగుచున్న శిక్షల కంతము లేదు. కొయ్యసలకపై నిత్యము తేనెబలపము లరిగిపోవునట్లు పాఠముల వ్రాయుటచే వేళ్లు కాయలు గాయుచున్నవి. విద్యలో నిరర్థకు డనిపించుకొనుట కతని కిష్టము లేదు. ఎంత శ్రమించిన నతడు స్నేహితులతో సరిపోల లేకున్నాడు. 'చంద్రమొద్దు' 'చాకిబండ' మొదలైన తిట్లకు దలబొప్పులు కట్టుచున్నది. నన్ను కాదని త్రోసివేసుకొని తిరుగగల తత్వమతనికి లేదు. సహజముగ నతడు తెలివితక్కువ వాడైన నెంతో బాగుండెడిది!

అట్టిస్థితిలో దండ్రి యొద్దనుండి యుత్తర మొకటి వచ్చినది. అదియతని వ్యాకుల హృదయమును మరింత కలత బెట్టినది. తన సంగతి తండ్రికి దెలిసినందు కతడు చింతపడి కన్నీరు గార్చినాడు. 'పాణినీయ శిక్ష'లో భాగమును గంఠస్థ మొనర్పనందు కాదినమున గయాశీర్షు డతని రెండుఘడియల కాల మేకాంతగృహమున బంధించి యవమానించినాడు.

శిక్ష ననుభవించి బయటకు వచ్చిన తక్షణమే చెట్టునీడల బుద్ధపాదముల కడ జదువుకొనుచున్న మంగళ, ధ్వజకేతువు లతనికి గనుపించినారు. అతివేగమున వారి కడకు వచ్చి యుద్రిక్త మానసములతో 'ధ్వజకేతూ! నేనీ గయాశీర్షుని శిక్షణాల,

నవమానములను భరింపలేకున్నాను. నాలంవ యున నాకస హ్యాము కలుగుచున్నది. గయాశీర్షునకు విద్యనేర్పు విధానము తెలియదు ’ అని తీక్ష్ణముగ బలికినాడు.

ధ్వజకేతువు సహజమగు చమత్కార లక్షణములతో ‘ఉం. సాదు రేగినది. తలపోలమన గాని నిలువ దన్నమాట!? యని నాడు. మంగళుడు గ్రంథపఠనమును జాలించి “ శాతకర్ణీ! ఈగోడ వంతయు నేమి’ టని ప్రశ్నించినాడు.

“ ఏమున్నది? నా నిత్యజీవితము; నరకప్రాయముగ నున్నది. సంస్కృత వ్యాకరణము, సూత్ర చింతన, కంఠస్థ మొనర్చ నందున చూచిరాత వినయ పాఠములు, చూచిరాత, ప్రాకృత వ్యాకరణము సూత్ర చింతన, చూచిరాత అటు పిమ్మట ఖగోళము మీనమేషముల లెక్కించుట తరువాత— దెబ్బలు, ఏకాంత గృహ నివాస మను నవమానము. నాపాలిటి యముని వలె నాగయాశీర్షు డవతరించినాడు, నే నిక నీ శిక్షణావిధానము నెంతో కాలము భరింపలేను ’ అని శిఖశాతకర్ణి దుఃఖముతో బలికినాడు.

మంగళు డిట్లనినాడు. “నీవు నుపాధ్యాయుల నిందింప జూచు కొనకుము. దానివలన నణుమాత్రమును బ్రయోజనము లేదు. కంఠస్థ మొనర్పకున్న గయాశీర్షుడు పాఠములు వచ్చిన ట్లంగీక రింపడు. అది వారి మార్గము.”

కరుణతో నతని మిత్రులోదార్చరని శాతకర్ణి యుద్దేశించి నాడు. మంగళుని వాక్యము లతని కసంతృప్తి కలిగించినవి. “అట్లే కానిమ్ము. ఈ రసవిహీన మైన మొరటుపద్ధతి నాయన

యెన్నాళ్ళు సాగించునో జూచెద" నని శాతకర్ణి యట నిలువ లేక వెనుదిరిగినాడు.

శాతకర్ణి ప్రవర్తన మంగళునకు నచ్చలేదు. వ్యతిరేకాభిప్రాయమును జెప్పినంతనే మిత్రునిపై నంతటి కోపమును దెచ్చుకొనుట విద్యార్థిజీవితమునకు బనికిరా దని యతని నమ్మకము. అయినను మిత్రు నసంతృప్తి పరచుట కిష్టపడక మరల దగ్గఱకు బిలిచి 'శిఖీ! తొందర పడకుము. పాత్రక్రమము నీకు గొత్తగ నున్నట్లున్నది. కాలము గడచిన నీకీ దాని రుచిని గ్రహింతువు. ఆనాడు గయాశీర్షుని విధానమును వేనోళ్ల పొగడుదు' వని స్నేహపూర్వకముగ బలికినాడు.

శాతకర్ణి కతని మాటలు మనసున కెక్కినట్లు లేదు.

మరునాడు విద్యామందిరమునకు బయలుదేరుచు గయాశీర్షుని విద్యావిధానమున నసంతృప్తిని బ్రకటింప నతడు నిశ్చయించుకొనినాడు. ఆదినమున నతని 'కంఠస్థము' మరింత నధ్వానముగ నున్నది. గయాశీర్షుడు సూత్రపాఠముల బది మారులు పలకపై వ్రాసిజూపు మని శిక్ష జెప్పినాడు. శిఖికి పట్టరాని కోపము వచ్చినది. చేతిలో నున్న కొయ్య పలకను నేలకు విసరికొట్టి పక్కున వికటముగ నవ్వినాడు.

ఆ యవినయమును సహింపలేక గయాశీర్షుడు మండిపడి 'శిఖీ! మదించి యొడలు మఱచిన ట్లున్నావు. నీవంటి నూతన విద్యార్థి కడ నిట్టి యవినయము సహింపరానిది. నీకు పదిదెబ్బలు శిక్ష విధించి'నా ననినాడు.

శిఖి 'చిత్త' మని చిత్రమైన గొంతుకలో వెటకారముగ బలుక నదివినిన విద్యార్థులు కలకల నవ్వినారు. గయాశీరు నకు గొరవి ద్రిప్పిన ట్లయినది.

"నీవింత మూర్ఖుడ వని నే ననుకొనలేదు. ప్రతి దుష్టచేష్ట కును శిక్ష పెరుగునని నీవెరుగవు కాబోలును. కక్ష్యనుండి నై దొలగి నిలువుము. పృథువు వచ్చి యట శిక్షను దీర్చును."

శిఖి భయపడుటకు ప్రతిగ గ్రంథములను, ఫలకమును జంకన బెట్టుకొని విద్యార్థుల నవ్వింపుచు విలక్షణమైన నడకలో బయటికి వెళ్ళినాడు.

గయాశీర్షుడు తోకద్రొక్కిన త్రాచువలె రొజుచున్నాడు నూతనశిక్ష యేమా యని యాలోచించుటకు గాని, యా యుపాధ్యాయుడు శాతకర్ణి ప్రస్తుతమానసిక స్థితి నణుమాత్రమైన నర్థమొనర్చుకొనుటకు బ్రయత్నింప లేదు. అతని శిక్ష లనుచితములని, నవమాన కరములని శాతకర్ణి నిర్ణయము. అట్టి సమయమున నతని నెంత కఠినముగ శిక్షించినను బ్రయోజన ముండదు. 'ఈదినము నీమతి క్రమముగ లేనట్లున్నది. నిన్ను నేను క్షమించుచున్నా' నని గయాశీర్షు డొక మాటౌదార్యముతో బలికిన నెంత బాగుండెడిది! మరుసటి దినము నుండి శిఖి కాలుగాలిన పిల్లివలె నతని ననుసరించెడివాడు.

కక్ష్యలో ప్రథమవిద్యార్థిని పృథువని వ్యవహరింతురు. ఉపాధ్యాయులు, నాచార్యులు జెప్పు శిక్షను పృథువులొసగుట నాలందలో పద్ధతి. అందువలన గయాశీర్షుడు శాతకర్ణికి దగ్గర నుండి పృథువుచే శిక్షనిప్పించినాడు. ఆసమయమున నతడు

బెదర లేదు; చెదర లేదు. కంట తడిబెట్ట లేదు. హృదయమును శిలాసదృశముగ గఠిన మొనర్చుకొని శిక్ష ననుభవించినాడు. ఉపాధ్యాయునిపై దనకు నిరసనభావ మధిక మైనట్లు వ్యక్త పరచినాడు. గయాశీర్షుడు దానిని గమనించినాడు.

మధ్యాహ్న వేళ నుపాధ్యాయ మందిరమున గయాశీర్షు డాలోచనాపరవశుడై యొంటరిగ గూర్చొనియున్నాడు. ఆయన యుపాధ్యాయ జీవితమున మున్నెన్నడు నట్టి కష్టస్థితి యేర్పడ లేదు. 'ఏమో యోచించు చున్నా' రని సహోపాధ్యాయు డమృతవర్షుడు ప్రశ్నించినాడు.

"ఈదిన ముదయము, నూతన విద్యార్థి, శాతకర్ణికి శిక్ష జెప్పినాను. అందువలన నతనిలో మార్పేమియును గలుగ లేదు; నాపై నిరసనభావ మధిక మైనది. అందువలన నేను కలతపడుచున్నాను."

"ఖగోళశాస్త్రముల నతడు నాయొద్ద జదువుచున్నాడు. ప్రవేశించినది మొదలు నాకు నతనికి శిక్ష జెప్పని దినము లే' దని అమృతవర్షుడనినాడు.

"అతని యవినయము నాకు నచ్చలేదు. శిక్షించినను ప్రయోజనము పొడకట్టదు. అయిన నతడు తెలివిగలవాడు.

కాశ్యపుడు దూరమునుండి యీ యుపాధ్యాయుల సంభాషణమునువిని మృదువుగ నిట్లనినాడు:

"ఆబాలునిగురించి మీరిరువురును దురభిప్రాయ పడు చున్నారు. అత డసన నాకు విశేషాభిమానము. విద్యాబుద్ధు

లలో మన యుత్తమ విద్యార్థులలో నతడెవ్వరికిని దీసిపోవు వాడు కాడు. అతని వినయగౌరవము లితరులకు లేవని నా నిశ్చయము. వినయపిటక పాఠముల బౌద్ధసంప్రదాయకము లైన నీతిపాఠములకై నాయొద్దకు వచ్చి నప్పు డతనిని గమనించి నాను. అతని కాత్మవిశ్వాస మధికము. ఇంచుక దయాను రాగములతో నతని వశమొనర్చుకొన నేను మిమ్ము ప్రార్థించు చున్నాను".

"అతనిని నే నెన్నడును నిగ్రహముతో జూడలే" దని గయా శీర్షు డనినాడు "నేను నతని యెడ ననురాగమునే ప్రకటించినా" నని అమృతవర్షుడు పలికినాడు.

"అయిన నతనికై మీ విద్యావిధానమును గొంత మార్చ వలదు" అని ఆచార్యకాశ్యపు డభిప్రాయమిచ్చెను.

"మావిధానమును నతని కొరకు మార్చుట కవకాశ ముండ" దని వారేకగ్రీవముగ బలికినారు.

"కఠినమార్గ మైనంత మాత్రమున నది యుచితము నుప యుక్తము, నుత్తమ మని నేను నమ్మను. క్షమింపు" డను కాశ్యపుని వాక్యముతో వా రేకీభవింప లేకపోయినారు.

సాయంత్రము బుద్ధ పూజావేళ కించుక బూర్వమే శాతకర్ణి నాలందా ప్రధానాచార్యుడు శీలభద్రుని దర్శించినాడు. తన జీవితమును మొరబెట్టుకొనినాడు. శిక్ష తప్పిదము, గయాశీర్షుని శిక్షణవిధాన మాయన కవగతమైనవి. అనురాగపూర్వకముగ నాయన యాలోచించినాడు. పూర్వము గయాశీర్షు డాయ

నందో జేసిన ప్రసంగములు కొన్ని జ్ఞప్తికివచ్చినవి. విద్యార్థు లసత్యవాదులు. శిక్ష యవినయము సహింపరానిదని నిశ్చయ మొనర్చుకొనినాడు. నాలంద చరిత్రలో నిట్టి విచిత్ర విద్యార్థి పూర్వ మెన్నడును గోచరింపలేదు. ఆయన నీకు తగిన శిక్ష జెప్పినగాని ఫలములేదు. లేకున్న విద్యార్థిలోకమున నవినీతి ప్రాకి పోవును.' అని శాతకర్ణితో బలికి బంపించినాడు.

శిక్ష కెటజూచినను జుక్క యెదురుగ నున్నది. అతనిది లొంగిపోవు స్వభావముకాదు. ధైర్యముతో జలిమంటల గాచు కొనుచున్న విద్యార్థులజేరి గతరాత్రి జరిగిన దంతయు వారికి జెప్పినాడు. అతనికి శీలభద్రాచార్యుని యెడ గోపము లేదు. ఆయన దమృతహృదయము. దానిలో విషముగలిపి చెడగొట్టిన వాడు గయాశీర్షుడు. ప్రసక్తమువచ్చినట్లు శాతకర్ణి జెప్పిన వాక్య ముల విని విద్యార్థులు మండిపడి యుపాధ్యాయుని కారుకూత లనినారు.

'ఆపాషాణమును నాలందనుండి బయటకు బంపలేమా?' యని మంజీరు డనినాడు.

'గొడ్రాలు బిడ్డనొప్పు లేమెరుగును? విద్యార్థుల మనస్సు లా 'మంగలికత్తి'కి తెలుసునా' అని ప్రగతి యనినాడు.

'నాకొక మంచి యూహ తోచినది.'

'ఏమది?'

'పరశురామప్రీతి'

'దేనిని'

'గయాశీర్షుడు మనపై గత్తిగట్టి ప్రాణాధికముగ దాచిపెట్టు
చున్న మన 'శిక్షణ పత్రికలు'

'బాగున్నది! జంఝూమారుతముగ నున్నది!! ప్రగతికి
జై! శిఖిశాతకర్ణికి జై! అను నినాదములతో విద్యార్థులు
కేకలుపెట్టినారు. గయాశీర్షుడు చైత్యగృహమున నుండుటను
గమనించి విద్యామందిరమునకు వారు బయనమైనారు.

కాషాయవస్త్రములతో జుట్టిపెట్టిన తాళపత్రగ్రంథముల
నన్నిటిని నేలపై గ్రుమ్మరించి నిప్పంటించినారు.

'ఇది మన కందరకును బ్రమాదము. మీరు నిప్పుద్రొక్కిన
కోతులవలె ప్రవర్తించుచున్నా' రని సునేత్రు డనిన మాట
నెవ్వరును పాటింపలేదు.

ధ్వజకేతువు 'శిఖీ! ఇవి మన 'శిక్షణ పత్రికలు' కావు.
ఆచార్యుని 'పారిమిత గ్రంథము' అనినాడు. వానినెట వెదకి
దహింపగలము. అన్నిటి రూపుమాపిన నవియును నశించు' నని
శాతకర్ణి శివమెత్తినట్లు తాళపత్రముల దహించుచు సమాధా
నము జెప్పినాడు.

అన్నిమూలల వెదకి వెదకి గ్రంథజాలములకు నిప్పంటించి
నారు. అవి సమస్తమును స్వల్పకాలమున భస్మరాసులై రూపు
మాసి పోయినవి.

వారి యుద్రేకము చల్లారినది. భయోత్పాత మారంభించి
నది. ఎవరికి వారెట్లు తప్పించుకొనుట యా యని యాలోచింప

సాగినారు. 'నూతన విద్యార్థి శాతకర్ణి గయాశీర్షుని గ్రంథ జాలమును భస్మ మొనర్చినా'డని నాలంద నలుదెసల ననతికాల ములో దెలిసిపోయినది.

ఎటు జూచిన నదియే సంభాషణ. కాని విద్యార్థు లెవ్వరు నుపాధ్యాయులకు గాని, యాచార్యులకుగాని యావార్తను దెలియపరచ లేదు.

"శిఖశాతకర్ణి కిక నాలందలో విద్యార్జన మొనర్ప తావుండునా ?" యనునదియే ప్రతివిద్యార్థి హృదయమును గలవర పెట్టుచున్న ప్రశ్న.

౭

మరునటిదిన ముదయము, పూజానంతరము విద్యార్థు లెవరి కక్ష్యలో వారు ప్రవేశించినారు. విద్యార్థులలో 'నుప్పిడి చప్పిడి' లేదు. గయాశీర్షుడు యథాక్రమముగ జేత వేపబెత్త ముల కట్టతో ప్రవేశించినాడు. ముందొక భస్మరాశి కను పించినది.

'ఈపని చేసిన దెవరు ?' అని ప్రశ్నించినాడు.

సమాధానము రాలేదు. ఆయన దృష్టి మరియొక వంకకు బ్రసరించినది. అట మరియొక భస్మరాశిలో సగము తగులబడిన తాళపత్రములు కనుపించినవి. భయోత్పాతము కలిగినది. స్మృతి దెచ్చుకొని యన్ని దిక్కుల పరికించి చూచినాడు. మరికొన్ని భస్మరాశులు కంటబడినవి.

ఆయన కన్నులు చంద్రనిప్రభ లైనవి. కక్ష్యలో నిశ్వాసము వినిపించు నంతటి నిశ్శబ్దము నిబిడమై యున్నది.

'నా గ్రంథము లేమైన' వని బిగ్గఱగ గయాశీర్షుడు ప్రశ్నించినాడు.

ఆయనకు 'దగ్ధమైన'వని యొక భయ కంపిత గాత్రము సమాధాన మిచ్చినది.

ఏదో జ్ఞప్తికి వచ్చినట్లు కావటిపెట్టె నెత్తి జూచుకొనినాడు; అందును గ్రంథజాలము లేదు.

'నా పారమిత గ్రంథమును దగ్ధమైనదా ?' కోపము మిన్ను ముట్ట గంపిత స్వనముతో బ్రశ్నించినాడు.

'అవును. వాటిని నేను దహించి నా'నని శిరమువంచి నిలువబడి శిఖశాతకర్ణి అనినాడు.

క్రోధము నాపుకొనలేక గయాశీర్షుడు గద్దెపైనుండి దిగివచ్చి శాతకర్ణి చెంపపై గట్టిదెబ్బ కొట్టినాడు. మరుక్షణమున నది బురబుర చేతివెంట పొంగినది. ఆ ధ్వనికి కక్ష్య మారోగినది. ప్రతివిద్యార్థికి నాదెబ్బ యతని చెంపపై బడిన ట్లనిపించినది.

గయాశీర్షుని కోపము క్రమముగ జల్లారినది. ఏమి యొనర్చుటకును దోచక నాయన కక్ష్యనుండి వెళ్ళిపోయినాడు.

ప్రక్కనున్న కక్ష్యలలో నాచార్య కాశ్యపుడు వినయపాఠముల జెప్పుచున్నాడు. గయాశీర్షుని గదిలో జెలరేగిన కలకలము విని యచటికి వచ్చినాడు. విద్యార్థుల సంభాషణమువలన సనుస్తమూ యన కవగతమైనది.

'శిఖ గయాశీర్షుని గ్రంథజాలమును దహించినా' డన్న వార్త నాయాచార్యుడు నమ్మలేకపోయినాడు. తన విద్యార్థుల నందఱ రక్షోన్నదధి గ్రంథాగారమున జయన్నకోన వెడలుడని శాసించి గయాశీర్షుని వెదుక నారంభించినాడు.

అత డుపాధ్యాయ మందిరమున మూర్తీభవించిన దుఃఖము వలె నొక మూల గూర్చొని యున్నాడు. కాశ్యపాచార్యు డతని సమీపించి "ఖిన్న వదనులై యున్నారు, ఏమి జరిగిన" దని ప్రశ్నించినాడు.

" ఏమియును లేదు. ఇరువదియైదు సంవత్సరముల నా జీవిత కృషి సమస్తము మంటగలసినది."

" మీ పారమిత గ్రంథములైన మిగిలినవా?"

" లేదు. కాశ్యపాచార్యా! వానికై నాజీవితము నంతయు ధారవోసినాను. శ్రమయంతయు బిడికెడు బూడిదగ నాకు దక్కినది".

" ఈదుష్కృత్యము నొనర్చినవాడు శిఖ యేనా?"

" అవును. మీప్రియశిష్యు డాశిఖయే! అతడు పేరునకు దగిన పనిచేసినాడు."

" అత డింత బుద్ధిహీను డని పూర్వ మెన్నడును నే నూహింపలేదు. మఱల గ్రంథరచన మారంభింపలేరా?"

" మఱలనా?— ఇరువదియైదేళ్ళనాటి ధైర్యసాహసము లెవరిత్తురు. ఆ శక్తి సామర్థ్యములు లభింపవలె నన్న మఱల పుట్టవలసినదే".

కాశ్యపున కేమనుటకు దోచలేదు. దీనావస్థలో నున్న గయాశీర్షుని విడిచిపెట్టి పోవుటకు హృదయ మంగీకరింపలేదు.

ఉపశమనవాక్యముల జెప్పవచ్చును; దుఃఖమును జేతితో దీసిపారవేయ తరముగాదు. 'ఆర్యా ! న న్నేకాంతముగ నుండనిం' డని గయాశీర్షుడు కాశ్యపుని గోరినాడు.

ఆచార్యకాశ్యపుడు త్వరితగతిని గయాశీర్షుని విద్యామందిర కక్ష్యకు విచ్చేసినాడు. భక్తి సూచకముగ విద్యార్థు లందఱు లేచి నిలువబడినారు. గురుపీఠమలంకరించి యాయన యిట్లు ప్రవచించినాడు.

"విద్యార్థులారా! మీ రెట్టిఘోరమైన తప్పిద మీనా డొనర్చినారో మీరెఱుగరు. గయాశీర్షుని యిరువదియైదు సంవత్సరముల కృషిని బూడిదకుప్ప జేసినారు. దానివలన విజ్ఞానమునకు దీరని విద్రోహ మొనర్చితిరి. మీరందఱును దోషులుగారని నే నెరుగుదును. దోషి యొక్కడే! అందును నతడు క్రొత్తవాడని వినుటకు నాకు సంతోషముగ నున్నది."

ఆచార్యుని వచనముల కడ్డువచ్చి మాటాడుట సామాన్య కృత్యము కాదు. అట్టిస్థితిలో ధ్వజకేతువు ధైర్యముతో ఆచార్యోత్తమా ! మేమందరమును దోషులమే. శిక్షాపాతకర్త మాత్రమే దోషి కాడు. గయాశీర్షుడు మాపైవిధించిన శిక్షల నన్నిటి నొక గ్రంథముగ జేసినాడు. వాటిని దహింపవలెనను కోరిక యందఱికిని గలిగినది. దహించినాము". అని పలికినాడు.

కాశ్యపుడు ధ్వజకేతువుపై దృష్టినిల్పి "శిక్షా పత్రికలా ?" వాని సంగతి నాకు దెలియదు. వానిని దగ్ధ మొనర్చుట మహా

ద్రోహము! శిక్షణకు బద్ధులు కాకుండుటయే మీ యుద్దేశ మన్నమాట!" యనినాడు.

"శిఖీ! క్షంతవ్యముగాని నీతప్పిద మెంత ప్రమాద కారియో నీ కర్థమైనదా? నీదుష్ట చేష్టవలన గయాశీర్షుడు క్రుంగిపోయినాడు. ఛీ! ముఖమెత్తుకొని యుపాధ్యాయుల నెట్లు చూడగలవు? సతీర్థులలో నెట్లు ప్రవర్తింపగలవు? సత్ప్రవర్తనగల విద్యార్థుల మధ్య నుండుటకు నీ వర్హుడవు కావు. నీ కేమి శిక్ష కలుగ నున్నదో నే నెరుగుదును. వ్యక్తిగతముగ నిన్ని నాలంద యావరణమునుండి పంపివేయవలయు నని నా కున్నది." అని పలికినాడు.

కాశ్యపాచార్యుని యొక్కొక మాట యొక బాణపు ములికి వలె శిఖిహృదయమున నాటుకొనినది. నిశ్చేష్టుడై నేలపై దృష్టి నిల్పి యట్లే నిలువబడినాడు. అతని కన్నులనుండి యొకటి రెండు దుఃఖాశ్రువులు నేలపైబడినవి. ఆచార్యుడు కక్ష్యనుండి వెడలిపోవుచున్నాడు.

"శిఖీ! కాశ్యపులవారి ననుసరించి 'అవి ప్రాత శిక్షాగ్రంథము' లని భ్రమపడి దహించినా మని చెప్పుము"—ధ్వజకేతువు శాత కర్ణితో ననురాగ పూర్వకముగ జెవిలో జెప్పినాడు. కాని యతడు కదలుట కిష్టపడ లేదు. అతని ముఖమున దైన్యదేవత తాండ వించుచున్నది.

"నీమనస్సు బాధపడుచు న్నట్లున్నది. ఘోరమైన తప్పిద మునే జేసినావు. చింతించి ప్రయోజన మేమున్నది? గయా

శిక్షుని కడకేగి నాతప్పిదము క్షమింపు మని వేడుకొనుము. ఆయన దయాసాగరు' డని ధ్వజకేతున్రు ప్రేమతో మఱల నొకమారు చెప్పిచూచినాడు.

శాతకర్ణి యప్పటికిని కదలలేదు. వెనుకనుండి యతని చేయి నెవరో పట్టుకొనినారు. అతడు 'పృథువిద్యార్థి', 'శీలభద్రులు నిన్ను వెంటబెట్టుకొని వారి ప్రత్యేక మందిరమునకు దీసుకొని రమ్మనినా ర'ని జెప్పినాడు. శిఖ చింతాదైన్యములతో నతని ననుసరించినాడు.

పృథువు ప్రధానాచార్య మందిరము ముందు శిఖశాతకర్ణిని నిలువబెట్టి వెళ్ళిపోయినాడు. లోపలనుండి కామాయినీభిక్కుణి వచ్చి 'ఆచార్యపాదులు నీతో నిప్పుడు మాట్లాడరు. అళిందా! ఈబాలకుని నాల్గుదినము లేకాంతగృహమున బంధించి యన్న పానము లిచ్చి జాగరూకతతో గాపాడుచుండు' మని వెడలి పోయినది.

శిఖ అళింద ననుసరించినాడు. ఆమె యతని నేకాంతమందిరమున బంధించినది. అచటికి మిత్రు లెవ్వరును మాటాడుట కైన రాకూడదు. భయముకంటె నవమాన మతని బాధించుచున్నది. హృదయము బ్రద్దలగునట్లుత డేడ్చినాడు. చుట్టు కొంత మేర నేల తడిసిపోయినది. దుఃఖించిన ప్రయోజన మేమని నచ్చజెప్పి యోదార్చుట కెవ్వరును లేరు.

అపరాహ్ణ మైనది. అళింద యన్నపానాదులతో బ్రవేశించిన తోడనే శిఖ దైన్యమును జూచి దయతో 'నాయనా! దుఃఖము వలన శాంతిలేదు. ధైర్యమును దెచ్చుకొనుము.

ఈశిక్ష నీ మంచికొరకే వచ్చినది. సత్ప్రవర్తన నలవాటు జేసుకొని గురుదేవుల యనురాగమునకు బాత్రుడవు గమ్మని పలికినది.

శిఖి భోజన మొనర్ప నిరాకరించినాడు. బలవంతము జేసి యతనిని బుజ్జగించి అళింద యన్నము దినిపించినది. అతనికి గావలసిన గ్రంథముల గొన్నిటి దెచ్చియిచ్చి కవాటమును బంధించి వెడలిపోయినది.

మధ్యాహ్న మంతయు నెట్లో గడచినది. శిఖి గదిలో నొంటిగ నున్నాడు. గ్రంథకాలక్షేప మొనరించుట కాతని బుద్ధి దానిపై బ్రసరింపలేదు. వాతాయనమునుండి సంధ్యారుణ కాంతు లతనిపై బడినవి. స్మృతిదెచ్చుకొని యందుండి విశాల ప్రకృతిని దర్శించి యతడు యుత్సాహమును జేకూర్చుకొనినాడు.

ఇంతలో కవాటమును దట్టి యెవరో దానిసందునుండి యొక లేఖను లోపల బడవేసినారు. వచ్చి లేఖను విప్పి జదువు కొనినాడు.

"మిత్రుడా! శిఖి! నీకై నేనెంత దుఃఖపడుచున్నానో నీ వూహింపలేవు. నీతో బాటీశిక్షణలో బాలుపంచుకొన వలెనని నాకున్నది. నీవంటి ధైర్యసాహసములు గల మిత్రుని జూచి హృదయమున నేను గర్వించుచున్నాను. నీతో నెన్నడును నేను గలహింపను. నీయూహాలకు విముఖుడను గాను.— మంగళుడు".

చీకటి పడినది. అళింద యొక దీపపు బ్రమిద నామందిర మున నుంచి యతనికి భోజనముపెట్టి మరల కవాటము బంధించి

నది. రాత్రి యంతయు శాతకర్ణి కంటికి నిద్రలేదు. అత డాలోచనా సాగరమున మగ్నుడైనాడు.

ఈరీతి నాల్గుదినములు గడచినవి. తెల్లవారిన తరువాత బుద్ధపూజానంతర మాచార్యు లాతనికి శిక్ష జెప్పవలసి యున్నది. దానిపై నతని భవిష్యజ్జీవిత మాధారపడినది. నాలందా విద్యాలయమున బ్రవేశపెట్టుచు తండ్రి పలికిన మాట లతనికి జ్ఞప్తికి వచ్చినవి. తండ్రి కోరికకును తనకు నెంతదూరము !

పొంగి పొరలివచ్చిన దుఃఖము నాపుకొనలేక బిగ్గఱగ నేడ్చినాడు.

ఆ యేకాంత మందిరము కడ కెవరో వ్యక్తి ప్రభాతకాలమునకు బూర్వమే వచ్చిన యలికిడి యైనది. అతడు కవాటము దగ్గఱకు జేరినాడు. తలుపుసందునుండి యొకలేఖను లోపలబడ వైచి యావ్యక్తి భయముతో మందమందముగ పరువెత్తిన ట్లున్నది. శిఖిని జూడరాదని శీలభద్రాచార్యుని యనుశాసనమే దీనికి కారణమై యుండును.

శిఖి యుత్తరమును జదువ నారంభించినాడు.

"ప్రియసోదరా ! శిఖీ ! నిన్ను నాలం దావరణమునుండి బయటకు పంపరని నిర్ణయమైనది. ఈవార్త నిన్నటి సాయంకాలమునుండి నీకెట్లు చేర్తునా యని హృదయ మారాటపడినది. ఇప్పటి కవకాశము చిక్కినది. ఇంతకు బూర్వమే యీవార్త వినిపించి నీమనఃక్లేశము నుపశమింప జేయలేక పోయినందుకు క్షమింపుము. గయాశీర్షుని దర్శించి నేమందరమును నిన్ను

క్షమింప వలసిన దని ప్రార్థించినాము. శిక్షవలన గల్గు భయ ముచే గడచిన మూడు దినములు నీతో మాటాడుటకు రాలేదు.
—నీ మంగళుడు."

లేఖను జదువుకొను నప్పుడే యవ్యక్తానంద మతని హృదయము నావరించినది. సంతోష రేఖలు ముఖమున ద్యోతక మైనవి. 'ఆవరణమునుండి నన్ను బహిష్కరింపరు. ఇక నాచార్యపాదు లొసగు నెట్టి శిక్షనైన నిక నే ననుభవింప గలను' అని యనుకొనినాడు.

అతని దృష్టి వాతాయనము వంకకు మఱలినది. దూరమున చైత్యాగార శిఖరము కనుపించినది. అతడు సంభ్రమభావముతో సాష్టాంగదండప్రణామ మాచరించినాడు. ఏదో యనుమానము తోచి లేఖను మఱల జదువుకొన నారంభించి 'మేము గయా శీర్షుల నిన్ను క్షమింపుమని వేడుకొనినాము' అను నర్థముగల వాక్యమును మఱల మఱల జదివినాడు. "ఇది నిజమేనా? నా తప్పిదమును గయాశీర్షులు మన్నించినారా? నిజమైన నాయన యెంతటి యుదారుడు! ఏమహాత్ముని హృదయమున కార్చిచ్చు రగిల్చినానో యాయనయే నన్ను క్షమించినాడా?" అతని మనస్సు యాతాయాతముగ నున్నది.

కవాటమును దెరచు చప్పుడు వినిపించినది. తలుపు విడివడి నది. మూర్తీభవించిన దయాదేవతవలె గయాశీర్షుని యున్నత మూర్తి యెదుట నిలువబడినది. శిఖ నిలువెల్ల చలించి ప్రత్యు త్థానమొనర్చి, మోకాళ్ళపై నిలిచి "ఆచార్యోత్తమా! నన్ను క్షమింపుడు. మీకు నేను తీరని యపచార మొనర్చినా నని

నా కర్థమైనది" అనినాడు. పిమ్మట చేతులుజాచి పాదస్పర్శ యొనర్చి 'మీరు కనుపించిన తక్షణమే నాతప్పిదమును జెప్పుకొని మన్నింప వేడుకొన హృదయ మెంత యారాటపడినదో యందు కదియే సాక్షి' యని నత శిరస్కుడైనాడు.

"నీవు నాకెంతటి యపచార మొనర్చి దుఃఖమును గల్పించినావో యిప్పటికైన నిశ్చయముగ గుర్తించినావా ?" అని గయాశీర్షుడు రుద్ధ కంఠముతో బలికినాడు.

ఆయనలో వెనుకటి ధోరణిలేదు. 'మహాత్మా ! నాదోష మవగత మైనది. కాశ్యపాచార్యుల వలన మీ రిరువదియైదు సంవత్సరములు దీక్షగ నొనర్చిన కృషిని దగ్ధ మొనర్చినా నని తెలుసుకొని బాధపడినాను. నన్ను క్షమింపరా ?' అని కన్నీరు మున్నీరుగ నేడ్చి యుపాధ్యాయుని పాదముల దడిపినాడు.

'బుద్ధభగవానుల క్షమాపణ నర్థించినావా ?' అని గయాశీర్షుడు గంభీరస్వరమున శిఖని బ్రశ్నించినాడు.

'దయాసాగరుడు భగవానుడు నన్ను తప్పక క్షమించెను. ఒకనాడు నే నిట్టి క్రూరుడ నౌదు నని మున్నెన్నడును భావింపలేదు. మహాత్మా ! మీ యనురాగమున కేరీతిగ బాత్రుడ నౌదునో దయయుంచి సెలవీయుడు. నా పరితప్తహృదయమునకు శాంతి చేకూరు' నని శిఖ గయాశీర్షునితో మొరబెట్టుకొనినాడు.

ఉపాధ్యాయునితో బ్రసంగించు సమయమున శాతకర్ణి ముఖమును జూచి మాటాడ లేకపోయినాడు. అతని హృదయ పరివర్తనమును గయాశీర్షుడు గమనించినాడు. ఆయన హృదయ

మున నిద్రించుచున్న దయాసాగర ముప్పొంగినది. శిఖి శిర ముపై జల్లని చేయినిల్పి నిమురుచు గయాశీర్షుడు సంతతధారగ గపోలములపై స్రవించుచున్న కన్నీరును దుడిచినాడు. పట్టరాని సంతోషముతో నొకమా రాయన ముఖమున దృష్టినిల్పినాడు. ఆయన ముఖమును దుఃఖదేవత క్రీడారంగముగ నొనర్చుకొనినది. అయిన నా తేజోమూర్తి యాననమున, దయారేఖలు వానకారు మెరపులవలె మెరయుచున్నవి. శాతకర్ణి యాయద్భుత ప్రభావమునకు ముగ్ధుడై సాష్టాంగదండప్రణామ మొనర్చి గురుదేవున కాత్మార్పణ మొనర్చుకొనినాడు.

అతనిని లేవదీసి గయాశీర్షు డిట్లు వాగమృతమును వర్షించినాడు. "లెమ్ము! నాయనా శిఖీ! లెమ్ము! నిన్ను నేను హృదయ పూర్వకముగ క్షమించినాను. నీవొనర్చిన దానివలన నేను నొక గుణపాఠమును నేర్చుకొనినాను. నీవు నొక పాఠమును నేర్చుకొంటివి. నావయసు వచ్చునాటికి నీవు సమస్త క్రోధమును జయించి భగవానుని యిచ్ఛ నెరిగి వర్తింతు వని నేను నమ్ముచున్నాను. నీతప్పిదమును సరిదిద్దుట కేమైన నొనర్చుటకు సిద్ధముగ నున్నా నని నావు. నీకృషివలన నాకు గలిగిన నష్టము తీరునది కాదు. నీవుత్తమ విద్యార్థి వనిపించుకొనిన నాకదియే పదివేలు."

ఉపాధ్యాయుని ప్రశాంత మధుర కంఠములో నౌదార్యము వెల్లువలై పారినది. "హృదయ పూర్వకముగ నిన్ను నేను క్షమించి నా" యన్న వాక్యము శాతకర్ణి యంతరాంతరముల హత్తుకొనినది. అతడు కన్నీటితో కృతజ్ఞతను వెల్లడించినాడు.

'శిఖీ! నీవిక స్వేచ్ఛగ వర్తింపుము. పూజా వేళ యైన దున్నది. చైత్యగృహమున కిరువురమును గలసిపోదము ర'మ్మని యతని భుజముపై శీతలహస్తముంచి గయాశీర్షుడు నడిపించుకొని పోవు చున్నాడు. త్రోవలో విద్యార్థులు బారులుదీర్చి నిలువబడి నమస్కరించుచు నుపాధ్యాయుని యెడ గౌరవమును బ్రదర్శించు చున్నారు. ఆ దృశ్యమువలన నాలందా విద్యార్థులకు క్షమ యెంతటి మహత్తరశక్తియో యవగతమైనది.

సిగ్గుచే విద్యార్థుల జూడలేక శిఖి నేలజూచుచు నడచినాడు. చైత్యగృహముననైన నతడు తలయెత్తలేదు. భోజనవేళ నతని ముఖమున నెత్తురుబొట్టు లేదు. చింతాయత్తుడై యితరులతో గలసి మెలసి తిరుగలేకున్నాడు. విద్యార్థులు ధైర్యమొసగి యతనిని బలుకరించుట లేదు. అతని నొక మహాదోషిగ పరిగ ణించి కొందఱుపాధ్యాయులును, నట్లే ప్రవర్తించినారు. ఆచార్యకాశ్యపుడైన ననురాగ పూర్వకముగ బూర్వమువలె నతనితో సంభాషింప లేదు.

పాపము ! శిఖి కవియన్నియు కాళరాత్రులు ! ధ్వజకేతు వతనితో మైత్రియొనర్ప మానలేదు. మంగళుడు, అమితాభుడు ననురాగముతో స్నేహము నెరపుచు నతని కానంద మొన గూర్ప బాటుపడుచున్నారు. గయాశీర్షు డతనిని బుద్ధపూజా సమయమున, వాహ్యాళి వేళల నప్పుడప్పుడు వెంటగొనిపోవు చున్నాడు.

పదిదినములైనతరువాత చండశ్రీశాతకర్ణి నాలందకు వచ్చినాడు. దీనికి కారణము ప్రధానాచార్యుడు శీలభద్రుడు.

డాయున కొక లేఖ వ్రాయుటయే. కుమారుని చరిత్ర సమస్తము నుపాధ్యాయుల వలన వినినాడు. రెండుదినము లచటనేయుండి యతని నేకాంతముగ నడిపించుకొని పోయి యేమేమో ప్రసంగించినాడు.

ఆ తండ్రికి నూతన పరిణామముతో దొఱకిన లాడుచున్న శిఖశాతకర్ణి యెడ నమ్మకము, నవ్యానురాగము జనించినది.

౫

గయాశీర్షుని గ్రంథజాల మగ్నిదగ్ధ మొనర్చుటవలన శిఖ శాతకర్ణి మంచిపేరు కొంతకాలము మరుగుపడినది. తిరిగి దానిని సంపాదించుకొన ధైర్యముతో నతడు విశ్వప్రయత్నము లొనర్చుచున్నాడు.

విజితావి, యతని బృందము నేడు శిఖతో మాటాడుటలేదు. అతడు కనుపించిన ప్రక్కకు దప్పుకొని పోవుచున్నారు. ఉదాత్తులు, ఉత్తములు నగు బ్రహ్మాయువు, గుణస్వామి యతనికి నూతన మిత్రులైనారు. వారి సుస్నేహమువలన మఱల శిఖ శాతకర్ణి యుత్తమబాలుడనిపించుకొను చున్నాడు. దానికతడు గ్రంథబాండాగారమున నొనర్చుచున్న విశేషకృషి, బల విద్యాప్రదర్శనములు సహకారులైనవి.

బుద్ధజయంత్యుత్సవములలో విద్యార్థుల సమస్త ప్రజ్ఞావిశేషములను బరిశీలించి వారికి బహుమానములొసగు టాచా

రము. కొన్ని ప్రదర్శనములు జరిగినవి. మరికొన్ని జరుగవలసి యున్నవి.

క్రీడాభూమి యంతయును జనసమ్మర్దముతో కళకళ లాడు చున్నది. ఆచార్యులు, ఉపాధ్యాయులు, విద్యార్థులు వారి స్థాన ముల బలవిద్యాప్రదర్శనమును జూచుటకై రంగస్థలమునకు నాలుగు దిక్కుల గూర్చొనినారు.

"నీ విందులో బాల్గొనక దప్పదు. బహుమతి నీదే" నని ధ్వజకేతువు శాతకర్ణిని హెచ్చరించినాడు. 'నీవుపాల్గొనుము. ఎందుకో నాకందు ప్రవేశింప నిష్టము లే'దని శాతకర్ణి యుతనితో ననినాడు. 'ఇతరు లందఱును నన్ను బహిష్కరించినారు. ఇంద రిలో నన్ను బలుకరించి నీ మంచి పేరును జెడగొట్టుకొనకు మని' ఖిన్నముఖముతో నతడు బలికిన వాక్యము ధ్వజకేతును గలతపెట్టినది.

ఉఫ్. నీతో మాటాడక వారొక యుత్తమ మిత్రుని గోల్పోవు చున్నారు. నేను నాహృదయము చెప్పిన ట్లొనర్చు వాడను. ఇతరుల జూచి వెరచి సత్యము నాచరింప భయపడను.—శిఖీ! ఈ ప్రదర్శనమున నీవు ప్రవేశింపక దప్పదని ధ్వజకేతు వతని నిర్బంధించినాడు.

"విద్యార్థు లందఱును నన్ను గేలిచేతురని భయపడు చున్నాను."

"ఆదుష్టుల గురించి నీవాలోచింప వద్దు. నీవు బాల్గొన కున్న నేనును బాల్గొనను."

" సోదరా ! నన్ను బలవంత పెట్టవద్దు. నాకేమో సిగ్గుగ నున్నది "

"శిఖీ ! నామాట వినవా ? తప్పదు. లెమ్ము ! రంగస్థలమున ప్రవేశింప సిద్ధపడు " మని జెప్పి ధ్వజకేతు వతనిని క్రీడాభూమికి గొని పోయినాడు.

కార్యకర్త బ్రహ్మయ్య 'బలప్రదర్శనమున బాల్గొను వారు పదిమంది యేనా? ' యని ప్రశ్నించి ధ్వజకేతువు, శాతకర్ణుల వైపు చూచినాడు. 'మే మిరువురము బాల్గొందుము ' అని ధ్వజకేతువు వారినామముల బ్రహ్మయ్యకు జెప్పి పత్రము వ్రాయించినాడు.

వారిరువురును మల్లవిద్యాప్రదర్శనకు యోగ్యమైన రూపములతో రంగస్థలమును బ్రవేశించినారు. విద్యార్థుల దృష్టి నాకర్షించి సమయమునకై వేచియున్నారు.

ప్రదర్శనములు కొన్ని సాగినవి. చిల్లర విద్యార్థుల నందఱ నేకశృంగు డోడించినాడు. నేడు రంగస్థలమున నలుగురు మాత్రమే యున్నారు.— ఏకశృంగుడు, కాత్యాయనుడు, ధ్వజకేతువు, శాతకర్ణి.

కాత్యాయనుడు ఏకశృంగు నోడించినాడు. తరువాత కాత్యాయనుడు ధ్వజకేతువుతో పోరాడి యోడిపోయినాడు. ఇక నిలచిన వారిరువురు మాత్రమే—ధ్వజకేతువు, శాతకర్ణి.

ధ్వజకేతువు పొడగరి. శాతకర్ణి యించుక కురుచ. కాని యతడు కాయపుష్టి గలవాడు. ఇరువురలో నెవరికి విజయము

చేకూరునో ముందు నిర్ణయించుట కవకాశము లేదు. 'శాతకర్ణి గెలుచు' నని యున్న నేమి ప్రమాదము జేకూరునో యని యెవ్వరు నతని పేరు బయటికి జెప్పుట లేదు.

ధ్వజకేతువు పోరాటమున మల్లబంధ ప్రావీణ్యమును జూపినప్పుడెల్ల—విద్యార్థులు సంతోషసూచకముగ గరతాళ ధ్వను లొనర్చుచున్నారు. అతని చెవులలో నుత్సాహ వాక్యములు రింగు మని మార్మ్రోగుచున్నవి. అతనికంటె నధిక నైపుణ్యమును శాతకర్ణి ప్రకటించి తప్పుకొని నపు డొక్కరును బలుకరు. అంతటితో నూరకున్న జాలును. గేలిచేసి వారతని నేడ్పించుచున్నారు. వారిమన స్తత్వమునకు ధ్వజకేతువు నొచ్చుకొని యొకటి రెండుమారులు తానే శిష్యుని బహిరంగముగ మెచ్చుకొనినాడు.

"ధ్వజకేతుని సంతోష పరచినట్లు శాతకర్ణిని విద్యార్థు లెవ్వరు నుత్సాహపరచుట లేదు. నిజముగ నతడే మేటి మల్లు" డని అమృతవర్షోపాధ్యాయుడు ప్రక్కన కూరుచున్న కామాయనీ భిక్కుణితో ననినాడు.

"దీని కంతటికి వెనుకటి యాతని దుష్కృత్యమే కారణమై యుండు" నని యామె పలికినది.

ఆమె వాక్యము రంగస్థలమున నున్న శాతకర్ణి చెవులబడినది. ఒకమారు దీనముగ విద్యార్థుల నందఱ జూచినాడు. వారు గేలిచేసినారు. అతనికి దుఃఖము వెల్లివిరిసి వచ్చినది. సహింపలేక 'జనమధ్యమున ప్రవేశించినాడు.

'శాతకర్ణి పోరాటమును చాలించి బయటకు వెళ్ళిపోవు చున్నాడు.'

"వెడలిపోవుటలో నాశ్చర్య మేమున్నది? మనము మూర్ఖుల వలె వ్యవహరించి యతనిని గెలిపించినాము." 'నిరుత్సాహ పడి నట్లున్నాడు.'

"అతడే మేటి మల్లుడు. అతనిచే పోరాడింప వలసినదే మన కుతంత్రము నతడు గ్రహించినాడు. మరల రంగస్థలమును ప్రవేశింప డేమో!" —అను వాక్యములు విద్యార్థుల నుండి వినిపించుచున్నవి.

మంగళుడు శాతకర్ణి దగ్గరకు వచ్చి 'ఈదుష్టులతో నీకేమి? ధైర్యము వహించి పోరాడి యవమానమును పొందుము.' అని చెప్పినాడు. 'శాతకర్ణీ! నీవు మల్లరంగమును వీడి పోవల' దని యుత్సాహముతో సమిత్రాభువు ప్రోత్సహించినాడు. శిఖి యామాటల లెక్క-బెట్టక గుంపులోనికి వెళ్ళిపోవుచున్నాడు.

కార్యకర్త బృహస్పతియును 'ధ్వజకేతూ! నీవు గెలిచి నట్లు విద్యార్థుల కెరుక పరితును' అనినాడు. అందుల కతడంగీకరింప లేదు.

'శిఖీ! ఈపని చేసితివి బాగుగ లేదు. నన్నవమానింప దలచినావా?' యని కేకపెట్టినాడు. మిత్రునిమాట యతని చెవినిబడినది. కపోలములపై జారుచున్న కన్నీటి బిందువుల తుడుచుకొనుచు దగ్గఱకు వచ్చి 'మిత్రమా! ధ్వజకేతూ! నన్నేందు పరీక్షించెదవు? నామానసికస్థితి యనుకూలముగ లేదు' అనినాడు.

'నీవు పోరాడి బహుమానము పొందక తప్పదు. లేకున్న నన్నవమానింప దలచినట్లు భావింతును. అదుగో! నిన్ను త్సాహపరుప గయాశీర్షోపాధ్యాయులు రంగస్థలమునకు వచ్చుచున్నా' రని ధ్వజకేతువు పలికినాడు.

'నీ కవమానముగ భావించిన దప్పక పోరాడుదును. కాని నా కానందము లేదు' అన్న వాక్యము గయాశీర్షుని చెవిని బడినది. "నీకేమియును భయము లేదు. పోరాడు మని యా యుపాధ్యాయుడు శాతకర్ణిని బుజ్జగించి యుత్సాహోపశమనము గావించినాడు.

శాతకర్ణి మజిల రంగస్థలమున బ్రవేశించి యుగ్రోపముగ బోరాడుచున్నాడు. మల్లవిద్యలో శిక్షకంతటి ప్రజ్ఞ యున్నదని ధ్వజకేతువునకు బూర్వ మెన్నడును దెలియదు. ఆకలిగొన్న కోదమసింగము వలె నతడు ధ్వజకేతువుపై లంఘించినపుడు విద్యార్థు లిక నుత్సాహనినాదము లొనర్పక నూరకొనలేకున్నారు. ఒకమా రతడు ప్రయోగించిన బంధవిశేషమునకు ధ్వజకేతువు పడబోయినాడు. అప్పుడు కరతాళధ్వనులు మిన్నుముట్టినవి. శిక్ష ముఖమున నానందము పొడకట్టినది.

మిత్రునకు ప్రథమబహుమానముపై నాశ యున్నదేమో యని యూహించి తా నోడిపోయినట్లని బ్రహ్మయ్యకు జెప్పి తాత్కాలికముగ ధ్వజకేతువు నొప్పించి శిక్ష వెడలినాడు. నెమ్మదిగ జెప్పి ప్రథమబహూకృతి నతనికే యిప్పింప వచ్చునను నుద్దేశముతో ధ్వజకేతు వపు డంగీకరించినాడు.

ప్రేక్షకులు, విద్యార్థులు, నుపాధ్యాయులు రత్నోదధిభాండాగారమునకు ముందున్న విశాలస్థలమున జేరుకొనినారు. బహుమానప్రదానసమయమున శాతకర్ణి పేరు బిలచినపు డతడు రాలేదు. ప్రథమబహుమాన మతని కిప్పించి ధ్వజకేతువు ద్వితీయబహుమానమును తీసుకొని, యిరువుర బహూకృతులఁగొని శాతకర్ణిని వెదకుచు నివాసగృహకక్ష్యకు వచ్చినాడు.

శాతకర్ణి ప్రథమబహుమానమును స్వీకరించుట కంగీకరింపలేదు. ధ్వజకేతువు నేను ద్వితీయబహుమానమును ఎప్ప స్వీకరింప ననినాడు. కొంత సంఘర్షణ జరిగిన తరువాత ‘ ఈ రెండును మన బహుమానములు; ఇరువురకును ప్రథమ ద్వితీయ బహుమానములు వచ్చినట్లు భావింతు మని సంధి జేసుకొనినారు.’ ఈవార్త నాలంద విద్యార్థులందఱిలో బ్రాకిపోయినది. ఆ యిరువురు మిత్రుల ఖ్యాతి విస్తరించినది. అందు విశేషముగ శాతకర్ణిని విద్యార్థులు పొగడినారు.

శిఖిశాతకర్ణి నేడు లోపరహితుడు. ఆచార్యులకు నుపాధ్యాయులకు ప్రియశిష్యుడు. కాని యతని దుఃఖ మింకను బూర్తిగ నివారణ కాలేదు. కాశ్యపాచార్యు డింక నతనిని పూర్వగౌరవముతో జూచుట లేదు. క్రమముగ శిఖి యా యాచార్యునకు బ్రీతిపాత్రు డైనాడు. కాని యతడింకను ‘నిన్ను క్షమించినా’ నని పలుకలేదు. నేడత డొనర్చుచున్న యత్నమంతయు దాని కొరకే.

*

## ౬

భోజనానంతరము శాతకర్ణి వసతిగృహ కక్ష్యకు దిరిగివచ్చి నాడు. అమితాభుడు మేల్కొని వెక్కి వెక్కి రోదించు చున్నాడు. అతనికడ కేగి శిశు శయ్యపై గూర్చొని దయతో 'నెందు కేడ్చుచున్నా' వని ప్రశ్నించినాడు.

'వాని కది యొక రోగము. ప్రతిస్వల్ప విషయమున కేవరో పైనబడి కొట్టిన ట్లేడ్చును. ఈ సంగతి కాషాయసీ భిక్కునికి జెప్పిన నీ మర్యాద దక్కనీయ' మని విజితావి, ఏకశృంగు లనినారు.

'చిన్నవానిని జేసి మీ రతని నేడ్పించుచున్నారా! జాగ్రత్త' యని కోపముతో శిశు యందఱు బెదరించినాడు.

'మాకు తెలియదు' ఉత్తరుడు, సుధానుడు ననినారు. 'నే నతని పల్లెత్తుమాట యనలే' దని ఉపవిజితావి యనినాడు.

'పాపము! వాని కల్లబొల్లి యేడ్పులకు గరగిపోవుచున్న ట్లున్నావు. పొట్టివానికి పుట్టెడు బుద్ధులు. వాడొనర్చు చిలిపి తనము నీ వేమెఱుగుదువు. తొందరపడి సక్రమముగ ప్రవర్తింప కున్న నీకును 'కాయశుద్ధి' కాగల' దని ఏకశృంగుడు దుడుకుగ నుడుకుమోతు తనముతో బలికినాడు.

'నాయెడ మీరెట్లు ప్రవర్తించినను భయములేదు. చిదిమిన పాల్గారు నీ చిన్నవాని ని ట్లేడ్పించుట న్యాయమా? లేక సభ్యమా? ఈతడవ మీ రతనిపై జేయిజేసు కున్న నేను సహింపను.'

'అమ్మో! భయము పుట్టుచున్నది. బావురు బిల్లివలె పై బడుదువు గాబోలు' నని విజితావి యనినాడు. 'సహింపకున్న మొనగాడి వే మొనర్తు' నని పాదరక్ష నతనిపై కెత్తినాడు. వానిపై కలియబడి దానిని లాగుకొని దూరముగ బారవైచి 'ఉదయము వెదకి తెచ్చుకొనుము' అని శిఖి యొళ్ళువిరిచినాడు. 'ఉదయము కానిమ్ము! నీకు తగిన బుద్ధి చెప్పకున్న నా పే రేకశృంగుడు కాదని 'గోడపై వ్రాసుకొననా?' అని శిఖి తిరస్కారభావముతో బలికినాడు. 'ఓ హృదయ మీ వెఱ్ఱివాడు నన్నేమో యొనర్తురట! అమితా! ఈ దినమునకు మనము సుఖముగ నిద్రింపవచ్చును. ఏమి? మాటాడవు? నేను వచ్చునప్పటికి వీరు నిన్నేమి చేసినారు?' అని శిఖి యమితాభుని ప్రశ్నించినాడు. తెల్లవారిన తరువాత విశదీకరింతు నని యతడు భయముతో సమాధానము జెప్పినాడు. నిద్ర పట్టించుకొనుము. ఏకశృంగుడు గాని, మరియొకడు గాని నిన్నేమి చేయగలరు?' అని యతనికి ధైర్యము జెప్పి తన కక్ష్యకు బయలుదేరబోవుచున్నాడు. స్నేహపురస్సరముగ శాతకర్ణి హస్తములలో శిరముంచి అమితాభుడు బిట్టుగ రోదించినాడు. శాతకర్ణి యూఱడగించి వెళ్ళిపోయినాడు. రాత్రియంతయు నమితాభునకు నిద్రపట్టలేదు. అతని తలగడ కన్నీటితో దడిసిపోయినది.

శిఖిహృదయము అమితాభుని దుఃఖకథ నెల్ల విన తహతహ పడుచున్నది. ఉదయమే మేల్కొనిన తరువాత నమితాభుని మంచమునుండి బయటకు రమ్మని పిలచి వెంటబెట్టుకొని కొంత దూరమునకు దీసుకొని పోయినాడు. శాతకర్ణి ప్రక్కన నడచు

నప్పు డమితాభు డెంత యానంద మనుభవించినాడో చెప్పుట కవకాశము లేదు.

పది యడుగులు నడచిన తరువాత 'అమితా! నీ కీ నాలంద లో నివాసము సంతోషకరముగ నున్నట్లు కనుపించదు. నిజ మేనా?' అని శాతకర్ణి అమితాభుని ప్రశ్నించినాడు.

"ఔను. సంతోషము లేదు. విద్యార్థిసోదరులలో నెటు జూచిన దౌష్ట్యము, నిర్దయ కనుపించుచున్నది. నాకక్ష్యలో నున్న వా రందఱును నాయెడ నతినీచముగ ప్రవర్తించుచున్నారు. వారు పశువులకంటె హీనులు. నాకు మిత్రు' డన్నవాడు లే డని' అమితాభుడు దీనముగ బలికినాడు.

"నన్ను నీవు మిత్రునిగ నెంచుకొనుట లేదా?"

"నీవే యిట లేకున్న నే నిక్కడ నుండగలిగెడు వాడనే కాను" శిఖి పెదవులపై నొక చిరునవ్వు నర్తించినది. రాత్రి నేను శీలభద్రాచార్యుని యొద్దనుండి వచ్చుచున్నపుడు నీకక్ష్యలో విద్యార్థు లొక బరుపుచుట్టను లాగుచున్నా రేమిటి? "అది పరుపుచుట్ట గాదు. నన్నే యొక్కదుప్పటిలో జుట్టి నేలపై లాగి చివరకు వాతాయనమునుండి క్రిందకు బడద్రోసినారు.

'ఉ. మఱల నెట్లు కక్ష్యకు రాగలిగినావు? వారిలో నొకడు వచ్చి కట్టు విప్పి నన్ను నడిపించుకొని వచ్చినాడు. ఈసంగతి నెవరికైన జెప్పిన నీప్రాణముల దక్కనీయ మని వారు నన్ను బెదరించినారు".

"ఎంత ప్రమాదము! వా రిట్టి ప్రాణమోసములకు బాల్పడుచున్నా రన్నమాట !

"ఇట్లు పూర్వ మెప్పుడైన నొనర్చినారా?" "లేదు." "కాని, నొకమారు కత్తిజూపి నన్ను బెదరించినారు". 'ఎందుకు ?' "వారిచ్చిన మత్తుపదార్థమును దాగుట కంగీకరింపలే దని" "మత్తు పదార్థమా?— వారి కెట్లు లభించినది"? నాలందలో ఫలము లమ్ము నెపమున వచ్చి కొందఱు బేరగాళ్ళు వారికి దెచ్చిపెట్టు చుందురు". "ఇట్టివి చెడ్డ యలవాట్లని నీవు వారితో ననలేదా?"

'లేదు, భయపడి యేమియు ననలేక పోయినా' నని సిగ్గుతో అమితాభుడు తల వంచుకొనినాడు.

'అట్టి దుష్టకృత్యములు మన మెన్నాడైన నెగ్గింపవలయును.'

"బలవంతుడవు నీ వేమైనా యొనరింపగలవు.— ఉపాధ్యాయుల కివన్నియును దెలియవు." "తెలియ జెప్పిన నేమగును?"

"ప్రాణములపై నాశ వదలుకొనిన గాని యిట్టిపని జేయరాదు". "పొరబాటు పడుచున్నావు. ఏకశృంగుడు, విజితాంవి, సుధన్వాదులు నీవలెనే బలహీనులుగను, ధైర్యరహితులుగ నిచ్చుటకు వచ్చినారు. వెరగు పడకుము. ముందెన్నడైన వా రట్టి దుష్క్రియలకు బూనుకొనిన వ్యతిరేకింపుము. బలవంత పెట్టిన ధైర్యము వహించి తిరుగబడుము" మని చెప్పి శాతకర్ణి అమితాభునిచే ప్రమాణము చేయించుకొనినాడు.

ఉత్తమ శీలుని కళ్ళయెదుట నాలందలో నిట్టి దుష్కృత్యములు సాగిపోవుట కత చెప్పబడలేదు. అమితాభు నెల్లిన వారి బారినుండి తప్పించి యీపవిత్రభూమిలో దుష్కృత్యముల సమసమును ధ్వజకేతువు, మంగళుల వంటి మిత్రుల సహాయముతో మాన్పింప వలెనని శాతకర్ణి కృతనిశ్చయుడై నాడు.

తెరుపరుగును మలుల వారికక్ష్యల జేరుకొను నప్పుడు శాతకర్ణి 'అమితాభా! 'దుష్టుల బారినుండి దూరునన్ను రక్షింపు భగవానుని ప్రార్థింపు' మని చెప్పి యతని పంపించినాడు. అతని కష్టముల జెప్పుకొని హృదయభారమును దింపుకొన నొక యాప్తమిత్రుడు దొరికెనని డను సంతోషముతో నమితాభుడు కళకళలాడుచు కక్ష్యను ప్రవేశించినాడు.

౭

సంవత్సరాంతము కొలది కాలములో నున్నది. విద్యార్థులకు శబ్దవిద్య పూర్తియైనది. కావ్యపాఠములు స్వల్పముగ మిగిలినవి. జాతకకథాగుచ్ఛము పూర్తి కావచ్చుచున్నది. 'న్యాయద్వార తర్కము'న గావలసిన భాగము లైనవి. విద్యార్థులు పరీక్షలకు శ్రమించి చదువుచున్నారు.

భిక్షుశాతకర్ణి పాఠప్రవచనానంతరము విద్యామందిర కక్ష్యనుండి యమితానందముతో బయటకు వచ్చి రేపు మన 'కనధ్యయన' మనినాడు.

"శిష్యు లెవ్వరైన వచ్చుచున్నారా ?" అని ధ్వజకేతు వడిగి నాడు.

"మొన్నటివలె అధ్యాపకుల వాగ్వాదములు జరుగునా?" అని మంగళుడు ప్రశ్నించినాడు.

"లేదు. మన పూర్వవిద్యార్థి ప్రమతి యోగశాస్త్రమున నూతన పరిశోధనల నొనర్చి బిరుదము నొందినాడట! జీవిత పర్యంత మాతడు నాలందలో నుండి యతః పరిశోధనల గొన సాగించుటకు పాటలీపుత్రాధిపతి యొక పారితోషికము నేర్పాటు చేయించినాడు. ప్రమతి మహామేధావి. అతడు నేటి విద్యార్థుల కెల్ల నాదర్శమూర్తి యని శీలభద్రాచార్యు లుదయము నాడే యనినా" రని శాతకర్ణి చెప్పెను.

కంటక శిఖరమున విహారమొనర్ప నేడుగురు మిత్రులు మరునా డుదయమే బయలుదేర నిశ్చయించుకొనినారు.

"అయిన నీమాట మనమిత్రులు బ్రహ్మయువు, గుణాఢ్యాదు లకు దెలియునా ? వారంగీకరింతురో లేదో"? యని మంగళు డనినాడు. "వారిని గొని వచ్చు భారము నాపై బెట్టు" డని శాతకర్ణి యనెను.

అశ్వశకటముపై కంటక పర్వతపాద ప్రదేశమును జేరుకొని సూర్యోదయారంభ వేళలో కొండనెక్క నారంభించినారు. వా రేడుగురు నొక యున్నత శిఖరముపై దృష్టినిలిపి దాని నధి రోహింపవలె నని నిశ్చయించుకొనినారు. కొంతదూర ముత్సా హముతో కాలుసాగినది. త్రోవలో శాతకర్ణి ప్రకృతిరమ్య

దృశ్యముల మిత్రులకు జూపించుచు రమణీయమైన వ్యాఖ్యాన మొనర్చుచున్నాడు. గుణస్వామి చిత్రకారుడు. కొన్ని దృశ్యముల నిలచి చూచుచు మనోగ్రంథమున వాని రూపముల లిఖించుకొను చున్నాడు.

పర్వతారోహణ మారంభించి రెండు ఘడియ లైనది. ఇంకను జేరవలసిన లక్ష్యము కడుదవ్వుగ నున్నది. శాతకర్ణి, మంగళుడు, ధ్వజకేతువులు ముందు నడచుచున్నారు. వెనుక బ్రహ్మయువు, గుణస్వామి నిలచుచు వచ్చుచున్నారు. బ్రహ్మయువునకు బర్వతారోహణము క్రొత్త. అత డలసి పోయినాడు.

"గుణస్వామీ! నేను ముందుకు సాగిరాలేను. మీరు తిరిగి వచ్చునంతవరకట కూర్చుండెదను. లేదా వెనుకకు మఱలి నెమ్మదిగ దిగిపోదును".

"నీపాదములు తడబడుట గమనించినాను. నిన్ను ముందుకు నడపించుట యుక్తము గాదని నాకును దోచుచున్నది. శాతకర్ణి యేమనునో!"

'శిఖీ' 'శిఖీ'!—

కరతాళధ్వను లొనర్చి గుణస్వామి ముందున్న వారి నాపినాడు. చేయూత నిచ్చి బ్రహ్మయువును వారిని జేరుకొను నంతవరకును నడపించి యతడు "మిత్రుడు బ్రహ్మయువు బాగుగ నలసిపోయినాడు. అతని కన్నులు తిరుగుచున్నవి. అతనిని నెమ్మదిగ నడపించుకొనుచు నేను దిగిపోయెదను" అనినాడు.

"నే నొంటిగ దిగిపోగలను. మీరందఱును శిఖరమును జేరుకొనుడు. మీయుత్సాహము భంగమగుట నాకిష్టము లే" దని బ్రహ్మయు వనినాడు.

బ్రహ్మయువును క్రిందికి దింపుటకు బ్రతిమిత్రుడును దన్నర్పించుకొనినాడు. అందఱికిని శిఖరమును జేరుకొని యచట నుండి విశాల భూభాగమును, రమణీయ ప్రకృతిని దర్శించు కోరిక మిక్కుటముగ నున్నది. అదియును గాక నాశిఖరమును జేరుకొనుట నాలందా విద్యాలయ విద్యార్థులొక సిరకృత్యముగ భావింతురు. ఆకీర్తియును బోగొట్టుకొనరానిది. కాని, వారిలో నొక్కరికిని కీర్తిపై నభిమానము లేదు. స్వార్థత్యాగమే వారి జీవితలక్ష్యము.

బ్రహ్మయువు నెవ రనుసరింతురను సమస్య యేల లేదు. అందఱును "నేను నే"నని ముందుకు వచ్చిన చిక్కు తీర్చిన దెవరు? ఒక భూర్జపత్రము నైదువిభాగములొనర్చి వానిలో నాల్గింటిపై "సిరి" వ్రాసి యొకదాని మీద బుద్ధపాదము నుంచి యెగుర వైచినారు. బుద్ధపాద మున్న పత్రఖండము నెత్తుకొనిన వాడు బ్రహ్మయువు ననుసరింపవలెనని నిర్ణయము.

ధ్వజకేతువు "బుద్ధపాదము" నెత్తుకొనినాడు. అవసరమగు భోజన పదార్థమును దీసికొని యతడు బ్రహ్మయువుతో పర్వతము నవరోహింప నారంభించినాడు. పదియడుగులు ముందుకు సాగలేదు. వెనుకనుండి "బ్రహ్మయూ! పాపమా అమితాభుని నీకక్ష్యలో జేర్చుకొని చదివించుము. అతడు కడు మంచి వాడు. దుష్టులలోబడి బాధపడుచున్నా" డని శిఖి పలికినాడు.

“నీవు చెప్పినట్లే యొనర్ప యత్నింతును. ప్రస్తుత మతడే స్థితిలో నున్నాడో!'

“ఏస్థితిలోనున్నను నీకతని విషయమున శ్రద్ధవహింపకదప్పదు. అతడతి సాధువు. కక్ష్యలోని విద్యార్థు లందఱు నతనిని నీచముగ జూచుచున్నారు. మృగ సూపకర్మంగు డతని నెంత కష్టపెట్టుచున్నాడో మీకు జెప్పవలె ననుకొనినాను. శీలుడున్న నతనిని నీకక్ష్యలోకి మార్పించుకొనుము. నాకక్ష్యకు జేర్పించుకొందమన్న నన్ను శీలభద్రుడు కొంతకాలము వారి సేవకు వినియోగించి నా' రని శాతకర్ణి యనుపస్థితిని వెల్లడించినాడు.

“కామాయనీ భిక్షుణితో నీనాడే తప్పక యతనిని గుఱించి మాటాడెదను. అతనిని నా కక్ష్యకు మార్పింతును.”

అమితాభుని విషయమున శ్రద్ధవహించుట వలన నతడు బ్రతికి బయటపడగలడు. పృథుసేనైన నీకది ముందు ప్రయోజనకారి కాగలదు.”

శిఖిశాతకర్ణి నాలందకు వచ్చి విశేషకాలము కాలేదు. కాని యతని శీల ముత్తమము, వాక్యములు సత్యాయుతములు, సాహసోపేతములు. ఇంతవరకును పృథువున్నై యుండి ధ్వజకేతువు, బ్రహ్మయువు నట్టి కరుణ కృత్యముల నెన్నడును దలపెట్టలేదు. శాతకర్ణి ప్రేరేపించి కర్తవ్యపాలనమున కుద్యుక్తుల గావించినందుకు వారిరువురును హృదయముల నతని గౌరవించిరి.

మిగిలిన ముప్పురు మిత్రులును ముందుకు సాగిపోయినారు. కొంతదూరము మార్గము బాగుగ నున్నది. తరువాత కొంత

దూరము వారు త్రాక పోవలసివచ్చినది. కష్టపడి వారు గిరి శృంగమును జేరుకొని సమతలమున గొంతసేపు సంభాషించు కొనినారు. నాలందలో విద్యార్థులు మున్నెన్నడును నొనర్పని సాహసకృత్య మొనర్చినా మన్న విజయగర్వము వారి ముఖము లలో నిండుకొనియున్నది.

మధ్యాహ్న భానుని గ్రమ్ముకొని మేఘములు వారికి శీత లత్వమును జేకూర్చు చున్నవి. చల్లనిగాలి వీచుచున్నది. వా రుత్సాహమునకో కేకిసలు గొట్టుచు లోయలు ప్రతిధ్వనింప గిరికి లాలాపించినారు. కేకలు బెట్టినారు.

అదిగో! ఆమేఘమాలిక లెంత రమణీయములుగ నున్నవి! మనపై నెండకాయుచున్నా డని సూర్యుని ముందుకు సాగ రానీయకుండ యతనిపై జైత్రయాత్ర కేగుచున్న ట్లున్న' వని శాతకర్ణి యనినాడు.

"శిఖి! అవి చూచినావా? వారు మొగలు లెట్లు క్రమ్మి వచ్చుచున్నవో! వర్షించి సెలయేరుల బారించిన మనము మరల విద్యాలయమును జేరుకొనగలమా?" అని మంగలు డనినాడు.

"శిఖికి నట్టి యూహయే దోచినది. తాను ధైర్యపడిన మిత్రు లిరువురును భయగ్రస్తు లగుదురు. 'ఈ పొగమబ్బులు క్షణములో మటుమాయము కాగలవు. అయినను మన మది క్రమ్ముకొని వచ్చులోపల నీ శిఖరము దిగి యాసమతలముపై జేరుకొనుట యుక్త" మని జెప్పినాడు. వారు కొంతదూరము దిగివచ్చినారు.

మేఘములు దట్టముగ క్రమ్ముకొని వచ్చుచున్నవి. క్షణములో చిమ్మచీకటులు చెలరేగినవి. దారి తెన్నులు తెలియుట లేదు.

"మనము నడచునది క్రమమైన మార్గమేనా శిఖీ?'. "దారి తప్పినట్లు నా కనుమానముగ నున్నది".

'దారి తప్పినామా?— మనము శిఖర మెక్కినత్రోవన దిగినట్లు లేదు." అని మంగళుడు భయమును వెలిబుచ్చినాడు.

'ఈలోయ దిగి యవతల శిఖరము చేరుకొన్న మనకు ముందుదారి కనుపించును'.

ఆపర్వతశ్రేణిలో నెక్కడనో వర్షము క్రుమ్మరించినట్లున్నది. గద్గదళన ధ్వనులతో సెలయేరులు పారుచున్నవి. 'ఇక మనము ముందుకు సాగుట ప్రమాదము. అదిగో వర్ష మారంభ మైన" దని మంగళు డనినాడు.

కుంభవృష్టి కురియుచున్నది. బాలురు ముప్పురును దడిసిపోయి నారు. ఎటుజూచిన నొకసెలయేరు వారిని బంధించి పర్వులెత్తు చున్నది. 'భగవానుని నమ్మి ముందుకు సాగిపోవుటయే మన కర్తవ్య మని యొకరిచేయి యొకరు పట్టుకొని పదియడుగులు వేసినారు. వాన వారి నడుగురాసి యడుగు బెట్టనీయ లేదు.

ఎదురుగ గనబడుచున్న శిఖర మెక్కిన దారి కనబడు నని వారాశించినారు. చేరుకొని జూడ నాపర్వత మేటవాలుగ సాగి పోయినది. బడలికచే చలిలో గడగడ వడకుచు నావర్షమున క్షణ కాల మట విశ్రమించినారు. 'ఆమబ్బు తెర తప్పువరకు మన మిట

ధైర్యముతో నున్న జాలును. దాని శక్తి యైపోయినది. భగవంతునియిచ్ఛ యెట్లున్న నట్లు జరుగును. భయపడి యేమి ప్రయోజనము?' అని శాతకర్ణి మిత్రులిరువురకు మఱల ధైర్యము జెప్పినాడు.

ఇంతలో నొక వెలుతురుపాయ యాకసమున బొడకట్టినది. వారిహృదయమున నాశారేఖ లుదయించినవి. కాని మరుక్షణముననే యవి మఱుమాయమైనవి.

శాతకర్ణి సహజమైన ధైర్యమును గోల్పోవలేదు. "మిత్రులారా! నే నీశృంగమును నొంటరిగ దాటి యెవరినైన దెలిసిన వారి బిలచుకొని వత్తును. మనకు మరియొక మార్గము లేదు. చీకటి బడుచున్నట్లున్నది. వర్షమాగినను రాత్రి యీ పర్వత ప్రదేశముల నుండుట ప్రమాద' మని శాతకర్ణి యనినాడు.

"నీవైన నట్టి సాహసమునకు బూనకొనకుము. అది ప్రమాదకారి. శృంగ మెంత యేటవాలుగ నున్నదో నీవు గమనించి నట్లు లేదు."

'లేకున్న మన మీరాత్రి గడచి బ్రతుకుట దుర్లభ' మని శిఖ దిగుట కారంభించినాడు. గుణస్వామి రోదింప నారంభించి నాడు. "మిత్రుడా! నీదుఃఖముతో నన్ను బంధింపవల'దని వారించి మంగుళునితో 'ధైర్యము కోలుపోకు' మని జెప్పి శాతకర్ణి దిగిపోవనారంభించెను.

వర్షము కొంత వెనుక బట్టినది. కాని చీకటి తగ్గలేదు. సూర్యాస్తమయ మైపోయినట్లున్నది. రెండు మూడు క్షణము

మైన తరువాత శాతకర్ణి భగవత్ప్రార్థనా గీతములు మిత్రులకు వినిపించుట లేదు.

సాహసముతో శాతకర్ణి యొక మార్గమును బట్టి కొంత దూరము నడచి యొక మెలిక తిరిగినాడు. అతని కొక క్రమమైన మార్గము కనుపించినది. కొండ మొదటికి జేరి విచారింపన సమయమై ఘడియ దాటినదని తెలిసినది. వర్ష మాగినది.

ఆపర్వతపాద ప్రదేశమున నున్న గ్రామము జేరుకొని మొదటి గృహము కడ నిలచి 'ఈకొండపై నన్ని మార్గములతో బరిచయముగలవా రెవ' రని ప్రశ్నించినాడు. ఆయింటి యజమాని యతనికి 'పిండికు' డను పశుపాలకుని గృహమును జూపించెను.

పిండికుడు కంటకపర్వత ప్రదేశములతో విశేష పరిచయముగల వాడు. పశుపాలకుడు. శాతకర్ణి కరుణకథ విని యతడు భిక్షు మిత్రులను క్షేమముగ దింపి నాలంద మార్గమును జూపింతునని యభయమిచ్చెను.

"అయిన నాలస్య మొనర్పకుము. నీ కష్టమును నే మెంచు కొనము."

"ఆ ప్రశ్న లేదు. విద్యార్థులు; మీరు చిక్కుపడినారని కావలసిన సాధనసామగ్రితో నతడు బయలుదేరినాడు. శాతకర్ణి దారిజూపింప పిండికు డతని ననుసరించినాడు. కొంతదూరము నడచిన తరువాత పిండికుడు దగ్గరదారిని జూచి శాతకర్ణి మిత్రు లున్న చోటకి నడిపించుచున్నాడు.

"శిఖీ! శిఖీ!" యను కేకలు వినిపించినవి.

"అరుగో నామిత్రులు దగ్గఱలో నున్నారు."

"మంగళా! స్వామీ!"

"ఇటు, ఇటు."

మువ్వురుమిత్రులును మఱల కలుసుకొనినారు. సహాయము లభించినది. వారు వేగముగ పిండికుడు కొనివచ్చిన యల్ప మగు నాహారమును స్వీకరించినారు.

'మార్గము క్లిష్టమైన నుదయము దిగుదము.'

"రాత్రి నిద్రించుట యతి ప్రమాదము".

నాలందకు నామువ్వురు బాలు రున్నస్థలమునుండి ప్రయాణ మతిభయంకరమైనది. పిండికుడు త్రాటితో మంగళ, గుణ స్వాముల నడుములబిగించి రొండికి కట్టుకొనినాడు. శాతకర్ణిని జాగరూకతతో వెనుక నడువు మని చెప్పి యతడు ముందు నడచుచున్నాడు.

చీకటి కొలదికాల ముండిపోయినది. కుఱు వెన్నెల వచ్చినది. సెలయేరు లడ్డము వచ్చిన చుట్టుదిరుగుచు, ప్రాకుచు, వారు కొంతదూరము నడచినారు. దుర్గమ ప్రదేశముల శిఖి గుణ స్వామి నెత్తుకొనినాడు. మంగళుడు ధైర్యము దెచ్చుకొని నడచినాడు. మిత్రు డెక్కడ తప్పటడుగు వేయునో యని జాగరూకతతో శాతకర్ణి కనిపెట్టుచున్నాడు.

అనతికాలములో వారు నాలందమార్గప్రారంభమును జేరు కొనినారు. విశేషముగ ప్రొద్దుబోలేదు. 'అమ్మయ్య! బ్రతికి

నాము" అని ధైర్యముత్తో మంగళుడు దీర్ఘనిశ్వాస మొనర్చెను. వారికి దూరముగ నాలంద చైత్యగృహమునందలి యాకాశ దీపము కన్పించినది. ఆవంకకు దిరిగి నమస్కరించినాడు.

పారితోషికముగ శాతకర్ణి పిండికునకు గొంతధన మీయ, నత డెంత బలవంతపెట్టినను గ్రహింప నంగీకరింపలేదు. శిక్షాజ్ఞాప కార్థముగ దన మొలలోనున్న చిఱుకత్తి నతని కిచ్చి యతని యనుమతితో నాలందమార్గమున మిత్రులగూడి పయినించినాడు.

ఉత్తరద్వారమును నుదయవేళ కన్పించినది. శీలభద్రాచార్యుడు విద్యార్థిమిత్రులు చెంతకును దిరిగిరానందున వెనుదిరిగి వచ్చిన ధ్వజకేతునను బ్రహ్మచారులవలన శాతకర్ణి యతని మిత్రులవార్త విని నాతురతతో నట నిలువబడి యున్నాడు.

శాతకర్ణి గురుదేవునికి నమస్కరించి వారికథ చెప్పెను.

అతని భుజముపై జెట్టి "నీవు సిమెడ" వని యాచార్యు డభినందించినాడు. నాతనవిద్యార్థు లనేకు లతని సగౌరవముగ సోత్సాహముగ సంభాషించినారు. గయాశీర్షునకు నమస్కరింప 'నిన్ను జూచి నేను గర్వించుచున్నా' నని యతని నొక చిఱునవ్వుతో నాశీర్వదించినాడు; 'మఱల నన్ను బెట్టి సాహస ప్రదేశములలో బయనింప వల' దని యాదేశించినాడు.

ఆచార్యపార్శ్వపు నేకాంతమున నతనితో "వెనుక నొక జోషిగ నిన్ను జూచినాను. ఈనాడు నీవు విద్యార్థులలో సాహసి వనుపేరును కొనినావు. కొలదికాలమునుండి నీలో

సువార్త వచ్చినదని వినుటకు నా కమితానందముగ నున్నది” అనినాడు.

శాంతరక్షిత భరింపరాని సంతోషముతో నతనికి పాదాభివందన మాచరించినాడు.

౮

పరీక్షలందు ప్రథమశ్రేణిలో నుత్తీర్ణులగుటకై విద్యార్థులు విశేషముగ కృషియొనర్చుచున్నారు. శిక్ష యొక దినమైన వృథాపోనిచ్చుటలేదు. శరీరస్వాస్థ్యము లేక నేదినమైన పాఠము వినకున్న గయాశీర్షుని యింటికేగి ప్రత్యేకముగ నతడు జెప్పించుకొనుచున్నారు. రాత్రింబవళ్లు నిద్రాహారము లెఱుగక నతడొనర్చిన విద్యాశ్రమకు దగిన ఫలితమేమి కానున్నదో!

గడచిన సాయంత్రముతో పరీక్షలు ముగిసినవి. ఆచార్యులు నుపాధ్యాయులు, ఫలితాంశముల వెల్లడించుటకు ముందు సభలుగావించి సంప్రదింపులు జరిపినారు. ఉత్తీర్ణతకు కేవల విద్యావైదుష్యములు చాలవు. వారి విద్యాబుద్ధులు, నీతి నియమము దానికి తోడ్పడును. రత్నోదధి గ్రంథభాండాగారమునకు ముందున్న స్థలమున సాయంతన వేళ పెద్దసభ చేసినారు. ఫలితాంశముల విన కుతూహలముతో విద్యార్థులందఱు నట చేరినారు.

ఉన్నతవేదికపై శీలభద్రు లుపవిష్టులైనారు. గయాశీర్షుడు, మౌద్గల్యాయనుడు, కాశ్యపుడు, అమృతవర్షుడు, ధారాపీయూ

షుడు మొదలైన యాచార్యులు, నుపాధ్యాయులు వారి స్థానముల నలంకరించినారు.

శిఖిశాతకర్ణి యతని కక్ష్యలో ప్రథముడుగ నుత్తీర్ణుడైనాడు. మంగళుని కక్ష్యలలో నతడు ప్రథముడు. ధ్వజకేతువు ద్వితీయుడు. 'ప్రమతిని' నాలంద ప్రథమవిద్యార్థిగ బట్టభద్రుని లొనర్చినారు. ఆచార్యులు స్నాతకోపన్యాస మొనరించిన పిమ్మట సభ ముగిసినది.

మరుసటి దిన ముదయ మైనది. విద్యార్థులు స్వగ్రామముల కేగుచున్నారు. నాలంద నాల్గుద్వారములకడ జనసమ్మర్దము విస్తారముగ నున్నది. కుమారుల గొనిపోవ కొందఱుతల్లిదండ్రులు విచ్చేసినారు. అనాథబాలుర నాలందలోనే యాచార్యులయొద్ద నివసించుట కేర్పాటు జరిగినది.

శిఖి సెలవులలో నింటి కేగక నమృతవర్ధునికడ ప్రత్యేకపాఠముల జదువుకొన దలచినాడు. కాని మంగళు డతనిని 'పది దినముల సెలవులు మాయింట గడపుదువు ర' మ్మని యాహ్వానించినాడు. మిత్రునకు కోపమువచ్చునేమో యని యత డంగీకరించినాడు.

"మంగళా! నీమాటను దీసివేయలేక వచ్చుటయే. కాని నాకు నాలందలోనే యీకాలము గడుపవలె నని యున్నది"

"మరుసటి సెలవుల కట్లే చేయవచ్చును. నన్ను తృప్తి పఱచుటకై నీవంగీకరించి నందుకు సంతోషము.

విద్యార్థు లందఱును వెళ్ళిపోయిన తరువాత మంగళుడు శాతకర్ణితో స్వగ్రామమునకు బయనమైనాడు. అతడు దరిద్రుడు. ఆకారణమున వారు ఖరరథముపై బ్రయాణ మొనర్పవలసి వచ్చినది. అతడు నిర్ధను డని మిత్రులు గ్రహించిన నే మను కొందురో యని యతనికి జెప్పరాని యభిమానము.

'మన రథము నెవ్వరును జూచుట లేదు గద?' యని మంగళుడు శాతకర్ణిని బ్రశ్నించినాడు.

"జూచిన వచ్చు లోప మేమున్నది? అందు కింత తత్తర పడెద వేల'? యని యతడు బలికినాడు.

రథము కొంత దూరము సాగినది.

వెనుక నొక 'మృగరథము' వచ్చుచున్నది. 'శిఖీ! మన బ్రతుకు బయటపడినది. అదిగో! ఏకశృంగుని మృగరథము. వాని నోట నువ్వుగింజయు దాగదు. తిరిగి వచ్చిన తరువాత నా ధనమదాంధుడు నలువురకు జెప్పి నన్నేడ్పించును.' అని మంగళుడు చిన్నబుచ్చుకొనినాడు. శాతకర్ణి "మిత్రుడా! నీవింతటి వ్యర్థుడ వనుకొనలే" దని శిఖ గర్వితముగ ననినాడు.

మంగళుని ఖరరథమును జూచినంతనే ఏకశృంగునికి గడు పుబ్బ నవ్వువచ్చినది. ఎప్పుడు తిరిగివచ్చి మిత్రులజేరి యాఖర రథమును వర్ణించి యేడ్పించుదునా యని యతడుబలాటు పడినాడు.

'అదిగో! దూరముగ నా వనమునకు వెనుక నున్నదే మా గ్రామము. అంత నిష్ప్రయోజక మైనది మరి యీ దేశము

నెచ్చటను గన్పింపదు. చూచిన పగలు మండిపోవుచున్న ట్లుండు నని మంగళుడు స్వగ్రామమును గురించి శాతకర్ణికి జెప్పినాడు.

"ఏమైన నది నీకు జన్మభూమి గదా! అట నివాసమున నీకు సంతోష ముండక తప్ప" దని శాతకర్ణి యనినాడు.

రాచబాట గడచి రథము డొంక బట్టినది. కొలది దినముల క్రితనే మూడునాళ్లు దుక్కుల వర్షము పడుటచే దారి యంతయు బురదగ నున్నది. ఖరములు లాగలే కున్నవి. "మంగళా! వాటిని బాధపెట్టుటకంటె నీకొంచెము దూరమును మనము నడచుట మంచిది గదా" యనినాడు.

ముందు మిత్రులిరువురును నడచుచున్నారు. వెనుక రథము వారి మాటలతో వచ్చుచున్నది.

ఖరరథముతో వారిరువురును మంగళుని కుటీర ద్వారముకడ నాగినారు. పిలుపువిని యతని తల్లి సునీథాదేవి కాళ్ళకు నీళ్లు దీసుకొని వచ్చినది. పాదప్రక్షాళన మొనర్చి మంగళుడు, శాతకర్ణితో నింటిలో బ్రవేశించినాడు.

"ఇతడు నామిత్రుడు శాతకర్ణి" అని శిఖిని తల్లికి బరిచయము జేసినాడు. 'శిఖీ! నేము పేదవార మని నీ కీపాటి కర్థమై యుండును. మాయింట సేవకు లుండరు. మూటలు లోపల తెచ్చి పెట్టెదను. కొంచెము విశ్రమింపు' మని యరుగుపై బరచియున్న చిరిచాప జూపించినాడు. 'నేనును నీకు సాయ మొనర్తు' నని శాతకర్ణి వెంటబయలు దేరినాడు.

సర్దుకొనుట పూర్తియైనది.

కుమారుడు మిత్రునితో ననినమాటలకు సునీథాదేవి హృదయము కలతనొందినది. ఆమె వచ్చిన భోలకుడు ధనికకుటుంబమునకు జెందినవాడని గ్రహించినది. 'నాయనకన్నులు' శాతని సంతోషపెట్ట మనమున నిశ్చయించుకొనినది.

"మా మంగళుడు పేదఱికమునకు సిగ్గుపడుచున్నట్లున్నాడు. అది యొక దోషముకాదని గుర్తించినట్లు లేదు. నాయనా శిఖీ! మాయింట నెట్టి లోపము లున్నను నీవు లెక్కపెట్టవద్దు".

"అమ్మా! మంగళుడు నాకు సోదరప్రాయుడు. అతని గృహము నాగృహమే" యని ప్రియపూర్వకముగ శాతకర్ణి ప్రత్యుత్తర మిచ్చెను.

ఏకాంతమున తల్లితో 'అమ్మా! మనము పేదవార మని యంగీకరించుటకు నీకంతరోష మెందుకు?' అని క్రోధముతో బలికినాడు.

'మంగళా! మన సద్భాగ్యప్రశంస నొనర్చినవాడవు నీవే కదా! పేదఱికము భగవదిచ్ఛ. ఈవిషయమును నీ వేనాటికైన గ్రహింతువు. దాని వలన కొన్ని సుగుణము లబ్బును. సౌఖ్యము లభించును. దానిని గుర్తించుటకు జ్ఞాననేత్ర మవసర మని సునీథాదేవి కుమారునకు బుద్ధులు చెప్పినది.

ఈప్రసంగము శాతకర్ణి చెవుల బడినది. నాలంద జీవితమున మంగళు డెంతమంచివాడు! ఇంటియొద్ద నత డిట్లు ప్రవర్తించునని శిఖి మున్నెన్నడు నూహింపలేదు. గౌరవ ప్రేమల బ్రకటించి పూజింపవలసిన మాతృదేవతను మిత్రుడు మాటిమాటికి దిరస్కరించుట యతనికి నచ్చలేదు. ఆత డాశ్చర్యపడినాడు.

విభేదభావము లేక కుమారునకును, శాతకర్ణికి నన్నపాన ముల జేకూర్చి యిచ్చిన సునీథాదేవిపై నతనికి గౌరవభావ మేర్పడినది. ఆమె యౌదార్యము నిరుపమాన మైనది. ఆమె ముఖము శాంతిదేవతకు నిలయము. ఆమె సదాచార పుంజము.

మిత్రుడు మంగళునితో సునీథాదేవి యున్నతిని ప్రశంసించి నాడు. వ్యంగ్యగర్భితముగ నామెను గౌరవింపు మని యాదేశించినాడు.

'మంగళా! మీయింట నివసించుట నాకు మహానందమును గల్గించినది. మీమాతృదేవత చూపించిన యనురాగమునకు నేను ముగ్ధుడ నైనాను. నీవామెను గౌరవింప నింకను నేర్చు కొనవలసి యున్నది".

చివర వాక్యమును వినిపించుకొనని నట్లు ప్రవర్తించి "శాతకర్ణీ! నీవాక్యము వినుటచే నాకెంతో సంతోషముగ నున్నది. ఈగ్రామమున నొక కుటీరములో నిరంతరము నివసింప వలసి వచ్చిన నీవంగీకరింతువా?

"నిశ్చయముగ గాని నొక సౌఖ్యభూమిగ నొనర్ప యత్నింతును".

"అప్పుడు నీయత్నము కేవలమును మృణ్మయమును ముద్ద జేసి స్వర్ణపిండమని భావించుటయే యగును"

మిత్రునకు సౌఖ్య స్వరూప మెట్టిదో యర్థము కాలేదు. అందుకు గొంతకాలము పట్టు నని తలపోసి శాతకర్ణి సంభాషణ మును మరియొక నూతనాంశమునకు మార్చినాడు.

పదిదినములు సంతోషముతో గడచినవి. సునీథాదేవి యాశీర్వాదముతో నామిత్రు లిరువురును మాఱల నాలందకు బయనమైనారు.

౯

సకాలమునకు నాలంద జేరుకొనవలె నని మిత్రు లిరువురును నిశ్చయించుకొని బయలుదేరినారు. కాని మార్గమధ్యమున గొన్ని చారిత్రాత్మక ప్రదేశము లున్నవి. వానిలో రాజగృహ మతి ముఖ్యమైనది. దానిని దర్శించుట కొక దినము పట్టినది. మూడుదినము లాలస్యముగ జేరుకొనినారు.

వారి నాహ్వానింప నుత్తరద్వారముకడ సుజాతుడు, బ్రహ్మ యువు కొంతదూర మెదురువచ్చినారు. ధ్వజకేతువు, గుణ స్వామి ద్వారముదగ్గఱ నున్న తోరణ శిల్పఖండముల బరిశీ లించుచు వారి కొఱకు నిలుచియున్నారు.

ఆచార్యులు, నుపాధ్యాయులు తిరిగి వచ్చిన విద్యార్థుల యోగక్షేమముల, వారి తల్లిదండ్రుల మంచిచెడ్డల సంభాషించి నారు. గృహపరిసరములు, వారి బంధు, మిత్ర, స్వరూప స్వభావములు విద్యార్థుల భావనాపథములనుండి యింకను తొలగి పోలేదు. ఇంటినుండి నూతనోత్సాహముతో, నవానందముతో, నూతనాశయ లక్ష్యములతో వారు తిరిగి నూతనవ్యక్తులవలె వచ్చినారు.

నాలంద నివాసకక్ష్యలలో మార్పు వచ్చినది. నేడు శిఖి శాతకర్ణి ఆచార్యకాశ్యపుని ప్రత్యేక మందిరమున నుండి కొంత కాల మాయనకు బరిచర్య మొనర్పవలసియున్నది. మంగళుడు వినయవిహారమున ద్వితీయ కక్ష్యలో నివసింప వలెను. కంటక విహారమున బ్రహ్మయుపు నివసింపవలెను. మంగళుడు ఛన్నవిహారములో నేకశృంగ విజితాపులతో నుండవలెను.

కొలదికాలముననే మంగళునికి, శాతకర్ణికి మధ్య మనస్పర్థ లేర్పడినవి. ఇరువురను మిత్రులైన విద్యార్థు లెంత యత్న మొనర్చిన నవి సమసిపోలేదు. తన వేదఱికమును శాతకర్ణి విద్యాలయములో నందఱకును వెల్లడించినాడని మంగళుని యనుమానము. కాని శిఖి యేమియు నెఱుగడు. లేకున్న విజితాపి కెట్లు తెలిసినది? ఏమైన నేమి?

తల్లియెడ మంగళుని ప్రవర్తనము శాతకర్ణి కణుమాత్రమును నచ్చలేదు. ధైర్యములో నామెను మన్నింప నేర్చుకొనుమని యతనికి జెప్పినాడు. ఇంతకు బూర్వము శాతకర్ణికి మంగళుడు పరమమిత్రుడు. నేడతనికి ధ్వజకేతుపు ప్రథమమిత్రుడు. బ్రహ్మయుపు ద్వితీయస్థానము నొందుచుకొన్నాడు. శాతకర్ణి మిత్రత్వమున నేడతనిది తృతీయస్థానము. ఇట్టి పరివర్తనమును మంగళుడు సంహరింపలేకపోయినాడు. పూర్వ మతనిపై జూపు ననురాగమును నేడు నాలందలో నుపాధ్యాయవర్గము శిఖిశాతకర్ణికి గట్టబెట్టుచున్నది.

శాతకర్ణికిని గష్టములు లేకపోలేదు. అవి ప్రధానముగ సాధువగు నమితాభునికి నాయపడుటవలన గలిగినవి. అయిన నతడు

వానిని లక్ష్యపెట్టుట లేదు. విజితావి, ఏకశృంగుల బారినుండి వానిని దప్పించుట కతడు బద్ధకంకణుడైనాడు. ఈవిషయము వారికిని దెలిసినది. అతడున్న వేళల వారు వాని జోలికి బోవుట లేదు. అతడు కాశ్యపుని యింటికి బయనమైన మరుక్షణమునుండి ప్రతినిత్య మతని నేడ్పించుట వారికి బరిపాటియైనది.

గాఢనిద్రలో నున్న అమితాభుని నెవరో బంధించినారు. అతడు చుట్లనుండి విడివడ దన్నుకొనుచున్నాడు. ఇట్టి దుష్కృత్యమునకు 'పశుబంధ' మని నాలంద విద్యార్థులలో వ్యవహార నామము. పశుబంధమున నొక్క-కొసన అమితాభునికాలి కొక త్రాడుగట్టి లాగునప్పుడెల్ల నతడు కెవ్వున కేక బెట్టుచున్నాడు. అవి క్రమముగ బెద్దవి గాజొచ్చినవి. భూతము పైబడి పీకినట్లు అమితాభుడు పెద్ద బొబ్బపెట్టినాడు.

ధ్వజకేతువు త్రుళ్ళిపడి లేచి 'ఏమది అమితాభా!' అని లేచికూర్చొనినాడు. ఆమాటవినిన నతని నోట మాటరాలేదు. మఱల నొక బొబ్బపెట్టినాడు. ధ్వజకేతువు ఎదుర మత్తు వదలించుకొని ద్వారముకడకు వచ్చి చూచినాడు. అతనికి అమితాభుని కాలికిగట్టిన త్రాడు కనిపించినది. దంతకాష్ఠముల కుపయోగించు కత్తితో దానిని ఛేదించినాడు.

ఏకశృంగుడు, విజితావి-యిరువురు మిగిలిన త్రాటిముక్క ద్వారదేశమున వెల్లికిలబడినారు. లేచి వచ్చిచూచు వేళకు ధ్వజకేతువు 'పశుబంధనము' నుండి అమితాభుని విప్పి తప్పించినాడు.

ఆదుష్టు లిరువురు నంతటితో బోలేదు. ధ్వజకేతువును బెద రింప దలచి లోపలికి వచ్చినారు.

“ఏమి టాదుష్టచేష్ట! విద్యాలయములో మీవంటి మూర్ఖు లుండుటకు వీలులేదు. మీచరిత్ర సమస్తమును మాప్రభువులకు దెలిసినది. మీసంగతిని ద్వారంలో జెప్పెదము.” అని ధ్వజకేతువు వారితో ననినాడు.

వారిరువురు నతనిసు సూక్ష్మముగ జూచి “జాగ్రత్త” యన్నట్లు సంజ్ఞ యొనర్చినారు. ధ్వజకేతువు రౌద్రమూర్తియై “దుష్టు లారా! ఇక తొలగిపొం’ డని కేక బెట్టినాడు.

నిదురమత్తు గొంతుకతో ‘ఏమది ధ్వజకేతూ’! అని యుత్ప లుడు లేచివచ్చినాడు. ‘ఈదుష్టు లిరువురు నమాయకుని జేసి మన యమితాభుని పశుబంధన మొనర్చినారు’. సిగ్గు సిగ్గు— పశుబంధనమా ?’

‘ఈవిషయమును బయటపెట్టిన మీముష్కర ప్రాణములను దక్కవు’. అని సకశృంగుడు బెదరించినాడు. విజితావి హస్త సంజ్ఞచే నామాటకు దాళము వేసినాడు.

“నే మూరక బోవుచున్నవారము కాము”. నిరర్థకముగ నొక సోదర విద్యార్థి నిట్లద్వేషించుటకంటె మరియొక క్రీడ మీ కేమి యును గన్పింపలేదా? మీరు పశువులు”.

“ఛీ! నోరుమూయుము. ఆ శిఖ వెధవ మీయురజేశికి పంగ్లు పెట్టినాడు. ఇప్పుడు మీపై చేయిజేసుకొనిన గ్రుద్దుకు జాలరు. మీయబ్బ యెవ డడ్డము వచ్చునో కాచుకొనుడు”.

ఏకశృంగుడు విసరిన పాదరక్ష ఉత్పలుని గుండెపై దాకి క్రింద బడినది. అతడు ముందుకు వచ్చినాడు. ధ్వజకేతువు 'వాని యొంటిపై దెబ్బబడిన 'నీ వప' యొలిపించెద ననినాడు.

ఇప్పుడు రభస పెట్టుకొనిన జిక్కుపోవుదు మనుభయములో ఏకశృంగ విజితావులు 'రేపు మీపని బట్టెంతు' మని సద్దుకొని పోయినారు. కేతుధ్వజుడు గజగజ వడకుచున్న అమితాభుని శయ్య కడ కేగి యతని నోదార్చి కన్నీరు దుడిచి నిద్రబుచ్చి నాడు.

మరుసటిదిన ముదయమే బుద్ధపూజకు చైత్యాలయమున కేగుచు నొకరి నొకరు కొరచూపులు జూచుకొనినారు. అమితాభుడు ఉత్పల ధ్వజకేతువుల మధ్య శిరమువంచి బెదరుచు నడచుచున్నాడు. అతని నుద్దేశించి 'ఓరీ!' పునుగుపిల్లీ! కలుకకము. తప్పించుకున్నా ననుకొనకు. మావల పెద్దది' అని ఏకశృంగుడు పలికినాడు.

భయముచే అమితాభుని ముఖ మెల్లవారినది; సమాధానము జెప్ప వెరచినాడు. ధ్వజకేతువు పొగరుకొని యిట్లని నాడు.

"పక్షులు, మీపన్నాగము లికసాగవు. శీలభద్రాచార్యు, లకు సమస్తము నివేదింపక నూరకొనము. ఇకనైన బుద్ధి తెచ్చు కొని సత్ప్రవర్తన నలవరచుకొనిన నీకు నాలందలో నిలువ నీడ యుండును. లేదా జాగ్రత్త!'

# ౧౦

అమితాభుని తనకక్ష్యలో నివసింప నంగీకరింప వలసినదిగ శాతకర్ణి శీలభద్రాచార్యుని వేడుకొనినాడు. ఆయన యంగీకరించినాడు. అమితాభు డదివిని యానంద పారవశ్యము నొందినాడు. ఇక విజితాంవి, ఏకశృంగుల గాలి యతనికి సోకదు. వారతని జోలికి రాలేరు. శాతకర్ణి యన వారికి సింహస్వప్నము.

కంటికి సుఖనిద్ర లేక బహుము దినములు పైబడినది. ఆనాటి రాత్రి అమితాభుడు మైమఱచి దారుఖండమువలె నిద్రపోవుచున్నాడు. అర్ధనిశీథమున నతని కక్ష్యలో నాముదపు దీపమునకు మించిన వెలుతురు కనిపించినది. మిలమిల మను నా కాంతిలో నతడు మేల్కొని శయ్యపై సగములేచి జూచినాడు.

ఒక విచిత్రవ్యక్తి రేగిన జుట్టుతో ముఖమున రక్తపు బిందువుల ధరించి ప్రక్కన నిలువబడినాడు. మఱియొక వ్యక్తి 'ప్రతిముఖము' ధరించి నల్లని గుడ్డలు కట్టుకొని సూరుగూపుతో సానబట్టిన చిఱుకత్తి చేతబుచ్చుకొని యెదుట నిలువబడి యున్నాడు.

భూతాకారములతో నున్న యా 'ఋముప్పర' వ్యక్తుల జూచిన తక్షణమే అమితాభుని గుండె దిగజారినది. వారతని నొకదెబ్బ కొట్టినారు. అది గుండెపై దగిలినది. ఒక బొబ్బపెట్టి వెనుకకు పడిపోయినాడు. వెంటనే కక్ష్యలోని సహపాఠులు మేల్కొనినారు. క్షణకాల మేమొనర్చుటకును వారికిదోచలేదు.

ఏకశృంగ, విజితావులు దుష్కృత్య మేదో తలపెట్టి మారు రూపముతో వచ్చియుందు రని ధ్వజకేతువు బుద్ధికి దోచినది. ముందు నిలచిన వ్యక్తి పైబడి యతని ప్రతిముఖమును లాగి వైచినాడు; అతని హృదయదేశమున నొక గ్రుద్దు పడినది. దిమ్మరపోయి యతడు నాలుగడుగులు వెనుకకు వేసినాడు.

శాతకర్ణికి మొదట కొంత మాంద్యము, భయానకత తోచినవి. ధ్వజకేతువు వారితో దలపడి నపుడు సమస్త మతని కర్థమైనది; వారిపై బడినాడు. కలహము సాగినది.

ఇరుపార్శ్వములనున్న కక్ష్యలలోని విద్యార్థులు మూగినారు. ధ్వజకేతువు భయముచే గంపించుచున్న యమితాభుని జేరి "గట్టిదెబ్బ తగిలినట్లున్నది. దిమ్మర పోయినాడు" అనినాడు.

'అమితాయువునకు ప్రాణ మున్నదా?'

"వాడు వట్టి టక్కరి దొంగ తొత్తు! ఎత్తి తినాడు. విజితావీ! మన కక్ష్యనుండి చల్లని నీరు దెమ్ము. నేని మత్తు వదలించెద' నని ఏకశృంగు డనినాడు.

శాతకర్ణి కఠినకంపిత స్వనమున నిట్లనినాడు.

"మీరతనిని ముట్టుకొనవద్దు. దూరముగ నుండుడు. నేను, ధ్వజకేతువు నితని సుస్థితికి దీసుకొని రాగలము. మీసంగతి శీలభద్రాచార్యులవారు కెరిగింపక నికతప్పదు. ఇటనుండి త్వరితము బొండు; స్మృతివచ్చి మిమ్ముజూచిన అమితాభుడు మరల భయపడును. మీరు రాక్షసులు! క్షణకాలములో గదలకున్న కామాయనీభిక్కునిని పిలచుకొని వత్తును".

అతని వాక్యములు ఏకశృంగ విజితాపుల హృదయముల గలతపెట్టినవి.

అట్టిస్థితిలో శాతకర్ణి యొకరిమాట వినువాడు కాడు; సంధి కంగీకరింపడు. భయవిహ్వాలతతో నాదుష్టు లిరువురును వెడలి పోయిరి. గుమిగూడిన విద్యార్థులు అమితాభుని యథాస్థితికిగొని వచ్చుట కెన్నో యత్నము లొనర్చినారు. కాని స్మృతిరాలేదు.

శాతకర్ణి, ధ్వజకేతువులు భయపడ నారంభించిరి. ఇరువురు నతని చేతులపై నెక్కించుకొని వైద్యశాలలో జేర్చినారు. ఆవశ్యకమైన ప్రథమచికిత్స యొనర్చి వైద్యోపాధ్యాయుడు ప్రాణభయము లే దని నపు డామిత్రు లిరువురకును గలిగిన యానందమునకు మేర లేదు.

తిరిగివచ్చి శాతకర్ణి శయ్యపై నిద్రించుటకు సిద్ధపడు చున్న సమయముప మఱల విజితావి, ఏకశృంగు లతని కక్ష్యకు వచ్చినారు.

"నేను మీరొనర్చిన సమస్తమును ప్రధానాచార్యునకు విన్నవింపక దప్పదు".

"అయిన నీహృదయమున మాపై నీర్ష్య యున్నదన్నమాట!"

"ఈర్ష్యయా ? ఎందుకు ? దుష్కృత్యముల మీయంతటి ఘనులు లేరనియా ? వాని కడ్డువచ్చుట యీర్ష్య కాదు. అది నావిద్యార్థి ధర్మము ! పవిత్ర కర్తవ్యము !!

"అయిన నీకును 'ఛిందరతాం' జరుగవలె నన్నమాట !"

'ఈధూర్తుల బెదరింపులకు వెరచు పిరికిపందను గాను.'

అరుణోదయమునకు బూర్వమే ఏకశృంగ, విజితాపులు మరల శాతకర్ణి కక్ష్యకు వచ్చి చేతితో దట్టి యతనిని నిద్ర మేల్కొలిపినారు.

'అయిన రాత్రి యుదంతమును పృథువులకు, ఆచార్యులకు విన్నవింప నిశ్చయించినా వన్నమాట!'

'అవును. విన్నవింప కున్న నాహృదయ మూరుకోనదు. అసత్యముతో దౌష్ట్యముతో నది సంధి కంగీకరింపదు.'

'ప్రతీకార మొనర్పగల శక్తిగలవార మని మరచిపోయిన ట్లున్నావు.'

'లేదు. మీదుష్టశక్తిని రూపుమాప దలచి యిట్టి నిశ్చయమునకు వచ్చినాను.'

'దానికి తిరుగు లేదా?'

'లేదు.'

మరుక్షణముననే ఏకశృంగుడు తూలి శాతకర్ణి ముఖముపై పిడికిలి మడిచి దెబ్బకొట్టినాడు. త్రిప్పుకొని యతడు మరల దారుణ హస్తచాలనముచే సమాధానము జెప్పినాడు. తనకంటె బలమున నధికుడైన ఏకశృంగునితో ధైర్యమే బలముగ శాతకర్ణి పోరాడినాడు. కాని యాయువు పట్టుల మంచి దెబ్బలు తగిలినవి. ఒకదెబ్బకు శాతకర్ణి నాసిక ఛెదరి రక్తము స్రవించినది. అతడు నేలపై బడినాడు. లోగడనే మేల్కొనిన విద్యార్థు లందరును గగ్గోలుగ రోదించినారు.

అది విని వాహ్యాళి కేగుచున్న అమృతవర్షుడు కక్ష్యలో ప్రవే శించి ఏకశృంగునితో శిఖిని జూపించుచు, "ఈదుష్ట క్రియకు బూనుకొన్నది నీవేనా?" యని ప్రశ్నించినాడు.

'శిఖ నాపై ముందుగ దుముకబోయి నేను తప్పుకొన, గోడకుకొట్టుకొని పడిపోయినా డని' ఏకశృంగుడు సమా ధానము జెప్పినాడు.

"అబద్ధము" అని ధ్వజకేతువు కతని ముఖమువంక తీక్ష్ణ మగు దృష్టిని బరపినాడు.

'నాయెదుట మీ రిట్లు కలహింప రా' దని వారిరువురి వాగ్వివాదము నాపి దీర్ఘబాహువు పీనవక్షుడు నగు కాల కూటునిపై దృష్టినిల్పి "పెద్దవాడవు నీవిట్టి దుష్కృత్యము జరుగుచున్న కన్నులు నప్పగించి యూరకున్నావా?" యని యుపాధ్యాయుడు గద్దించి పలికినాడు.

"ఏకశృంగ! నీవు కేవలము పశువువు. ఒక పది దినములు నిన్నే కాంతగృహమున బంధింప శిక్ష జెప్పినాను".

తేరుకొనుచున్న శిఖిశాతకర్ణి మూలుగు చెవిబడినది. ఆవాక్యాన కాశారేఖ పొడకట్టినది. అతని శిరోభాగమున నొక ప్రక్కన కూర్చుండి "నాయనా! శిఖీ! మంచిదెబ్బలు తగిలిన ట్లున్నవి. నీవంటి యుత్తమ విద్యార్థిపై తలపడినందు కాదుష్టునకు దగిన శిక్ష జెప్పి నీగౌరవమును కాపాడినాను." అని యతడు పలికినాడు. అప్పటికిని శాతకర్ణికి స్మృతి రాలేదు.

అతనిని వైద్యశాలకు గొనిపొమ్మని ధ్వజకేతువున కాదేశ మిచ్చి అమృతవర్షోపాధ్యాయుడు కక్ష్యను వీడినాడు.

ధ్వజకేతు వినువును మిత్రుల సహాయముతో నతనిని వైద్యశాలకు జేర్చి చికిత్సజేయించి కొంతస్మృతి వచ్చిన తరువాత తిరిగివచ్చినాడు.

అతడు విజితావి, ఏకశృంగుల కక్ష్యలో ప్రవేశించి ధైర్యముతో నిట్లనెను. 'ఏకశృంగ! నీవు మిత్రుడు శాతకర్ణిపై జేయిచేసుకొనినావు. అభము శుభ మెరుగని సాధువు నమితాభుని పశుబంధ మొనర్చి చంపయత్నించినావు. సమస్తమును నేను పృథువులకు, విన్నవింతును. నిన్ను నాలందనుండి పంపివేయకున్న నీదౌష్ట్యములతో మేము బ్రతుకలే కున్నాము".

తన దౌష్ట్యము కొంత బహిరంగ మైన దను భయముననో యేమో ఏకశృంగుడు కొలదిగ తగ్గి 'ఆపృథువులు నన్నేమి చేయగలరు? అమృతవర్షులు నాకు జెప్పవలసిన శిక్ష జెప్పినారు' అనినాడు.

వెఱ్ఱివాడ వన్నట్లు ముఖాభినయ మొనర్చి ధ్వజకేతు విట్లనినాడు:

"అంత సులభముగ దప్పిపోవు ననుకొనకుము" "కుందేటికి కొమ్ములు వచ్చినప్పుడు చూచెదను లెమ్ము"

## ౧౧

అమితాభుడు, శాతకర్ణి యెట్లున్నారో చూడవలె నని మరు సటిదిన ముదయవేళ బ్రహ్మాయువు వైద్యశాల కేగెను. అమి తాభుని ముఖము వివర్ణమై యున్నది. భీతాహ మతని నింకను వీడినట్లు లేదు. మృత్యు వావహించిన వానివలె శాతకర్ణి శయ్యపై బరుండి యున్నాడు. కాని కనులు మూసుకొని నిశ్చ లముగ నేమో యత డాలోచించుచున్నాడు.

బ్రహ్మాయువు నిశ్శబ్దముగ వైద్యశాలలో బ్రవేశించి శాత కర్ణిని చేతితో మృదువుగ తట్టి లేపినాడు. అతడు చిరునవ్వుతో శయ్యపై గూర్చుండు మని యాహ్వానించినాడు.

'శిఖీ! బాధ కొంత తగ్గినదా ?'

'నా కేమియు విశేషముగ దెబ్బలు తగులలేదు'

'పాపము! అమితాభు డెట్లున్నాడు' ?

'అతని స్థితియే నన్ను గలత పెట్టుచున్నది.'

'స్వల్పకాలములో నతనికి స్వాస్థ్యము చేకూరు నను కొందును'.

'బుద్ధానుగ్రహ మెట్లున్నదో ! కాని యతని యెడ మనము కడు శ్రద్ధవహింపవలెను.'

'మిత్రుడు ధ్వజకేతువు వారిని గురించి పృథువులతో జెప్పి నాడా ?'

'నీ వావిషయములు నాలోచించుచు మనస్సు జెడగొట్టు కొనకుము.'

'ఈ విషయమున నీవెరిగిన దంతయును దెలియపలుపు' మని శాతకర్ణి బ్రహ్మయ్యను నాతురతతో నడిగినాడు.

"మిత్రుడు ధ్వజకేతువు పృథువులతో సంభాషింపక పూర్వమే ఏకశృంగుని దుష్టచేష్టలు నాలంద నలుమూలల బ్రాకిపోయినవి. పూజానంతరము మేము విద్యామందిరమున మాకక్ష్యలలో బ్రవేశించినాము. ద్వితీయపృథువు శిక్షింప ఏకశృంగుని బిలచి 'కోదండమును' సిద్ధమొనర్చినాడు. నా యాశిక్షను స్వీకరింప నిరాకరించినాడు.

అంతటితో ద్వితీయపృథు వూరకొనినాడా?'

లేదు. ప్రథమ పృథువునకు నివేదించినాడు. అతనితో నీతలబిరుసు తనమున శిక్ష పెరుగునే గాని తరుగ' దని బెదరించినాడు. ప్రథమపృథువు సమస్తకక్ష్యల పృథువుల బిలచి రత్నసాగర భాండాగారావరణమున నొక సభగావించి సంప్రదించి యొక తీర్మానమునకు వచ్చినాడు. ఆసభ కొందరు విద్యార్థులలో గలవరము గలిగించినది. వారందరును దానికి బ్రతిగ నొక సభ గావించినారు. పృథువుల నిందించినారు. ఏకశృంగ విజితాప్పు లొనరించినవి పరిహాసకృత్యము లట! వాటిని మనము దుష్కృత్యము లని గిట్టక బ్రచార మొనర్చినా మట! మనల నాడి పోసినారు. దీని కంతకును నాయకు డెవ్వడై యుండునో నీ వూహింపగలవా?

శిఖికి తెలియకపోలేదు. బ్రహ్మాయువుచే జెప్పింపదలచి 'ఎవ' రని ప్రశ్నించినాడు. "మన మంగళుడు. మరలనిప్పుడొకసభ జరుగనున్నది. సాధ్యమైనంతవరకీవిషయముల నాలోచింప వలదని నా ప్రార్థన. లేకున్న నీకారోగ్యము చేకూరదు." అని బ్రహ్మాయువు వైద్యశాలనుండి గ్రంథభాండాగారము లున్న ధర్మగంజుకు పోవుచున్నాడు.

కొన్ని క్రుద్ధ కంఠములు వినిపించుచున్నవి. సభాంగణమున గొందరు విద్యార్థులు సభ జేయుచున్నారు. ప్రతివిద్యార్థియును లేచి 'విద్యార్థుల శిక్షింప పృథువుల కధికార మెవరిచ్చినారు? వారి యధికారమును శక్తితో నెదురొడ్డక కున్న విద్యార్థి లోకమున కెంతటి యపకీర్తి! ఎంతటిప్రమాదము!!' అని రేగిన గండుతుమ్మెదలవలె రొదపెట్టుచున్నారు.

'మనమిట్లు శిక్షణరహితముగ మాట్లాడుకొని ప్రయోజనము లేదు. ఒక యధ్యక్షు నెన్నుకొని క్రమముగ సభసాగింత' మని యొకవిద్యార్థి వేదికపైకెక్కి బిగ్గరగ బిలచుచు, నందర నిశ్శబ్ద ముగ నుంచినాడు. సభవారేకగ్రీవముగ, మంగళుని సభాపతిగ నాహ్వానించినారు.

అతడు వేదికపై నిలచి ప్రస్తుతకష్టస్థితిని గురించి తన యభిప్రాయముల వెల్లడించినాడు.

"ఏకశృంగుడు జలిపితనమున కమితాభుని పశుబంధన మొనర్చి యేడ్పించినాడని ద్వితీయపృథువు కోదండముతో శిక్షింప నిశ్చయించినాడు. ఆశిక్షను స్వీకరింప నేకశృంగు డంగీకరింపలేదు. అందులకై విద్యాలయ పృథువు లందరును

జేరి యతనిని శిక్షించుటఎట్లని యొక సభ జేసినారు. కాని వారికి విద్యార్థుల నిష్టానుసారముగ శిక్షించు నధికారము లేదని నామతము. దీనిని మన మందఱ మొకసారి యెదుర్కొనక తప్పదు."

"జరిగిన విషయ మొక పరిహాసకృత్యము. కాని దాని ఫలితములు కొన్ని దుఃఖావహములుగ బరిణమించినవి. దానికి మన మందఱమును జింతింపవలసినదే. అట్టి యవాంతరములు సంభవించునని ముందెవ్వరును గలగనలేదు.

"పృథువుల కట్టి యధికారము లేదని నానిర్ణయము" అను మంగళుని వాక్యమునకు విద్యార్థిసభలో హర్షనినాదములు, కరతాళధ్వనులు జెలరేగినవి. పరిహాసకృత్యముగ నొనర్ప బోయిన దాని ఫలితాంశము నెవరు కలగనగలరను నతని వాక్యము విద్యార్థుల హృదయమున నాటినది. "నిజము. ఏక శృంగుని శిక్షించు నధికారము మాపృథువులకు లేదు." అని విద్యార్థు లేకగ్రీవముగ దీర్మానించినారు.

మంగళుని దూరమునుండి ధ్వజకేతువు తీక్ష్ణ, క్రోధ దృష్టు లతో జూచుచున్నాడు. ఆపాదమస్తక మతని నసహ్యించుకొని నాడు. మంగళుని వాక్యావసానమున నత డుద్రిక్త హృదయ ముతో లేచి యతని యభిప్రాయములకు ముదముగ నొక మాటలసెలయేరు నొలికించినాడు. లేచి నిలువబడిన వెను వెంటనే సభలో కలకలము బయలుదేరినది. కాని యతడు వెఱువలేదు. కృతనిశ్చయముతో సభనలుమూలల బరికించుచు,

"మీలో కొందఱు నన్ను పరిహసింతురని నేనెఱుగుదును. నేనే ఏకశృంగుని దుష్టచేష్టల గుఱించి ద్వితీయ పృథువున కెఱుక పఱచినానని మీ రనుకొనుచున్నట్లున్నారు. కాని యది సత్యము కాదు. అయిన నేను చెప్పుటకు వెఱచువాడను గాని, సిగ్గుపడువాడను గాని కాను. అతని ముఖముననే నానిశ్చయ మును వెల్లడించినాను.

"ఇది విద్యార్థిసభ గావున నిందు ప్రసంగించుటకు నాకు నధి కార మున్నది. మనలో ప్రతివ్యక్తికి నట్టి యధికార మున్నది. మంగళుడు మీకన్నులలో దుమ్ము చల్లుచున్నాడు. సత్య మొకటి; అతడు మీకు నివేదించినది మఱియొకటి. ఏకశృంగు డొనర్చినది పరిహాసకృత్యమా? అది యట్టిదని ద్రోసిపుచ్చుట కష్టముగాదు. అంత స్వల్పముగ దానిని బరిగణించిన నిక మనలో నేవిద్యార్థి నిర్భయముగ నీయావరణమున బ్రతుకగలడు. ఆదుష్కృత్యమును పరిహాసక్రియగ హృదయపూర్వకముగ మంగ ళుడు బఱిగణించినాడా? నేను నమ్మలేదు. అతడు కేవలము స్వల్పమైన 'పేరునకు' సత్యమును మఱుగు పఱచు చున్నాడు. వ్యక్తిగతముగ నతనికిని శిఖిశాతకర్ణికి నున్న మనస్పర్థల మఱచి పోలేక నిట్లు ప్రవర్తించుచున్నాడు. ఇది యతని హృదయము సంతోషింప వలసిన సమయము కాదు; సిగ్గుపడవలసిన వేళ...

సభాపతి పదవి నలంకరించిన మంగళుడు కోపముతో ద్రుళ్ళి పడి లేచి ధ్వజకేతువుతో,

"నేను మీవలన దిట్లు తినుటకీసభాపతిగ నుండ నంగీకరింప లేదు. మన యధికారముల నప్రమత్తులై మెలగి పృథువులకు

దాసులు కావలదని హెచ్చరింప దలచినా" నని చెప్పి "వ్యక్తి దూషణకు బూనుకొనిన నీసభలో నీవు ప్రసంగింప నిక నవకాశ మొసగుటకు వీలులే"దనినాడు. ధ్వజకేతువు మరల నతని యుపన్యాసమును ప్రారంభించినాడు.

"అయిన అమితాభుని పశుబంధన మొనర్చుట యొక పరిహాసకృత్యమా? పరిహాసకృత్యముగ నుద్దేశితమును గాదు. అది కేవలము హృదయపూర్వకముగ నొనర్చిన యొక కిరాత కృత్యము! పాశవ కృత్యము!!

"అట్టి వారి నీ పరమపునీత నాలందావిద్యాలయములో విద్యార్థులుగ నుండ నిచ్చుట సంస్థ కపకీర్తి. వారిని పృథువులు శిక్షించుటకు సర్వవిధముల నధికారులు".

అతని వాక్యముల కొక మూలనైన నంగీకారము కనుపించ లేదు. బ్రహ్మయువు వచ్చి యతని భుజముపై దక్షిణహస్త ముంచి 'ధ్వజకేతూ! సంతోషము! ధర్మవీరుని వలె ప్రసంగించినావు. మన శాతకర్ణియు నిట్లు ప్రసంగించునా యని నాకను మానముగ నున్న' దనినాడు. ధ్వజకేతువున కాతని యొక్క వాక్యము చాలును. ఇతరు లంగీకరించిన నేమి? లేకున్న నేమి?"

అటుపిమ్మట అచలుడు లేచి కఠినవాక్యముల మరి కొన్నిటి గుమ్మరించి 'తనకంటె రెండింతలు చిన్న వారితో పరిహాస మేమిటి? పసివానిని భయపెట్టుట వీరమా? వివేకమా?—అది పిరికితనము!—అత డెవరను ప్రమేయము లేదు; హృదయము కోమలము. చిదిమిన పాల్గారు చిన్నవారిపై నేయజేసు కొనుటలో నేమానంధము?' అని ప్రశ్నించినాడు.

సుధాన్ముడు లేచి 'నేటి సమస్య మంగళుడు చెప్పినది కాదు. మరియొకటి? ఏకశృంగుని వంటి కర్కోటకుల స్వేచ్ఛగ ప్రవర్తింపనిచ్చి సాటి విద్యార్థుల బెదరించి భయపెట్టి వెర్రివారిని చేయుట కంగీకరించుటా? లేక వారిని పృథువులచే శిక్షింపజేసి క్రమశిక్షణకు లోబడి వర్తించుటా?' అనునది. సోదరులారా! ఈరెంటిలో విద్యార్థిలోకమున కేయ్యది మేలొనగూర్చునది? మీరే యాలోచింపుడు.

తరువాత నాసభలో గలకలము చెలరేగినది. కొందఱు పృథువుల వెక్కిరించినారు; కొందఱు ఏకశృంగుని బొగడినారు. శాతకర్ణి ధ్వజకేతువులు, కొందరు వ్యక్తులపై నున్న కక్షదీర్చుకొన నొక గొప్ప పన్నాగమును బన్నినారని కొందఱనినారు. కొందఱు వారిని మెచ్చుకొనినారు.

అధికసంఖ్యాకులు "పృథువుల శిక్షలను ధిక్కరింపవలసినదే" యని నిశ్చయించినారు.

కలకలము మధ్య బ్రహ్మాయువు వేదికపై నిలువబడినాడు. సభ నిశ్శబ్దమైనది. అతడు విద్యావిషయకముగ విజయబుద్ధి సంపన్నుడు, శీలయుతుడు. ఈగుణము వలన నతడనిన విద్యార్థుల కభిమానము. ఇంతకు ముందెన్నడు నతడు సభలలో ముందుకు వచ్చి ప్రసంగింపలేదు. అతని యూహ లెట్లుండునో విన విద్యార్థులకు గుతూహల మధికముగనున్నది.

జరిగిన చర్చల నన్నిటిని సమన్వయించి బ్రహ్మాయువు మంగళుని ప్రశ్నలకు సమాధాన మొసగ నారంభించెను. "అమితాభుని బంధించుట కేవలము పరిహాసకృత్యమా? అంతటి పసి

వారితో పరిహాస మేమిటి ? అది దుష్టకృత్యము ! శిక్షణపొంది తీరవలసినదే. లేకున్న విద్యార్థులకే ప్రమాదము. వ్యతిరేకించిన విద్యాలయమున సదాచారము నశించు" నని పలికినాడు. వైద్యశాలలో శాతకర్ణి, అమితాభుల దుస్థితి వారి కన్నుల గట్టినట్లతడు ప్రదర్శించి విద్యార్థుల హృదయవీథులలో దుష్టుల యెడ క్రోధమును, సాధులయెడ కరుణ ప్రేరేపించినాడు. సభలో హర్షధ్వానములు కరతాళధ్వనులు చెలరేగినవి. పట్ట రానికోపమునతో ఏకశృంగునిది తప్పిదము కావచ్చును. పృథువుల కేమి జోక్య'మని బ్రహ్మయువును కొందఱు ప్రశ్నించినారు.

"పృథువులు మన మెన్నుకొన్న పెద్దలు. బుద్ధిమంతులు, అనుభవజ్ఞులు, వారికి మనల శిక్షించ నధికారము మనమే యొసగినాము. ఆచార్యపాదులు దాని నంగీకరించినారు. దుష్ట కృత్యములోనర్చు వారికి పృథువుల ధిక్కరించి యాచార్యులలో వారిపై నభియోగ మొనర్ప లేశమైన నైతికాధికారము లేదు. పశుశక్తి వారి కధికారము కావచ్చును. "పృథువులు విద్యా లయమున క్రమశిక్షణ నిల్పి పేరు ప్రతిష్ఠల గడియించి యిచ్చి నారు. వారిని ధిక్కరింప బూనుటవలన మనకే నష్టము. పృథువులు లేరనుకొనుడు. మన విద్యాలయ స్థితి యెట్లుండునో యాలోచింపుడు. శక్తిహీనులైన విద్యార్థుల జీవిత మెట్లుండునో యూహింపుడు ! ! వారిట్టి దుష్టులకు బలియైపోవలసినదేనా ? 'పృథువులకు విద్యార్థుల శిక్షించు నధికారము లేదనిన మంగ ళుని తీర్మానమును నేను హృదయపూర్వకముగ వ్యతిరేకించు చున్నా' నని బ్రహ్మయువు నిర్భయముగ బలికి విరమించినాడు.

ఉత్తమ శక్తివంతమైన సంభాషణకు సభలో హర్ష ధ్వానములు మాఱుల చెలరేగినవి. అనేకుల హృదయములు పొంగారినవి. మంగళుని మానసవీధిలో ననంత భావమేఘములు పయనించి నవి. పూర్వమిత్రుడు శాతకర్ణి వైపునకు హృదయము పర్వు లెత్తుచున్నది. లేచి తీర్మానమును జదివి యభిప్రాయ మొసగి నాడు. విద్యార్థుల శిక్షించుటకు ప్రభువుల కధికార మున్నదా లేదాయను ప్రశ్నమునకు ననుకూలురు, వ్యతిరేకులు సమ సంఖ్యాకులైనారు.

వ్యతిరేకపక్షమున నొకవ్యక్తి సభాపతి యిష్టము సమస్యను దేల్పగల దని పలికినాడు.

మంగళుడు కొంత సేపు నిశ్చలముగ గూర్చొనె. విద్యార్థు లలో తన కీర్తి లోటు పోవునో యన్నభయమున "నాయభి ప్రాయము ప్రభువులకు వ్యతిరేక మని" నాడు. సభలో హర్ష నాదములు కరతాళ ధ్వనులు జెలరేగినవి.

బ్రహ్మదత్తుడు మరల నిలచి మంగళు నుద్దేశించి యిట్లనినాడు.

"ఈసభ పరిపూర్ణ మైనదిగాదు. విద్యాలయమున నున్న విద్యార్థులలో నిట జేరినవా రల్పసంఖ్యాకులు. అందువలన తీర్మానమును నీ యొక్కని వ్యతిరేకతతో నెగ్గించి ప్రభులకును విద్యార్థులకును మధ్య నంతఃకలహముల బ్రవేశపెంచుట యుక్తము గాదని" "అంతఃకలహముమాట తరువాత నాలోచింతము. తీర్మానము నెగ్గినది, ప్రభువులకు విద్యార్థుల శిక్షించు నధి కారము లేదు." అని మంగళుడు ఖండితముగ బలికి సభ జాలించినాడు.

ధ్వజకేతువు శాతకర్ణిని జూచి యొకదినము గడచినది. సభ ముగిసిన తక్షణమే సభావృత్తాంతముల వినగుతూహలపడుచున్న యాతనికి సమస్తమును దెలియపరుప నతడు వైద్యశాలకు వెడలినాడు. అమితాభుని మనశ్చాంచల్య మింకను కుదుటబడ లేదు; మధ్యమధ్య నతడు వెఱ్ఱిగ కేకలు వేయుచున్నాడు. శాతకర్ణి యతని శయ్యపై గూర్చుండి యతని కుపచారము లొనర్చుచున్నాడు. బ్రహ్మాయువు ముందే యచటకు జేరినాడు.

ధ్వజకేతువు శాతకర్ణితో సభావృత్తాంతములు విశదీకరించినాడు. "నేడు మన బ్రహ్మాయు మిత్రు డొక మహావక్తవలె నుపన్యసించినా డని పలికినాడు. ఇరువురును సత్యమునకై పోరాడినందుకు శాతకర్ణి వారి కభినందన వాక్యములు పలికినాడు.

"నేనొనర్చిన దేమియు లేదు. మంగళుడు మనకు బూర్తిగ వ్యతిరేకియైనాడు. లేకున్న నీనాడు ఏకశృంగుని బ్రతుకు బయటపడెడిది.—మంగళుడు క్షణములో మారుట చిత్రముగ నున్నది".

బ్రహ్మాయు వపుడే మందుతీసికొని వైద్యుని కక్ష్యనుండి ప్రవేశించినాడు. అతనిని జూచి ధ్వజకేతువు "సభావృత్తాంతము నెల్ల మిత్రునికి విశదపరచినాను" అనినాడు.

"అందుకణుమాత్రము మనకు కీర్తివచ్చిన నది నీది!" యని బ్రహ్మాయు వనినాడు. 'నీవు బహిరంగంలో సత్యమువైపు

ధైర్యము వహించి ప్రసంగించినందుకు నాయభినందము' లని శిఖిశాతకర్ణి బ్రహ్మోయువును గౌరవించినాడు.

నావాక్యములకు వెనుక నున్న సమస్తశక్తియును నీవిచ్చినదే'

నీయభిప్రాయము నా కవగత మగుటలేదు'.

నీమైత్రి లేకున్న నేను కేవలము స్వార్థపరత్వముతో వెనుకటివలె వ్యవహరించెడి వాడనే'. మీయిరువురకు నేనొక ముఖ్యవార్త గొనివచ్చినాను" అని ధ్వజకేతు వనినాడు. "ఏమిటది?" యని శాతకర్ణి, బ్రహ్మోయువు లాతురతతో యతని ప్రశ్నించినారు.

"ప్రథమవృషువు మధ్యాహ్నము వారికి శిక్ష చెప్పను. శీలభద్రాచార్యులు పాఠప్రవచనానంతరము విద్యార్థుల వారివారి ప్రవచన కక్ష్యలలో నుండ నాజ్ఞాపించినాడు".

సాయంత్రము పాఠప్రవచన మైపోయినది. బుద్ధపూజకు బయులుదేరు వేళ. ఆచార్యులు కక్ష్యలనుండి వెడలిపోయినారు. ప్రథమవృషువు వేదికపై నిలచి యిట్లడిగినాడు.

"ఏకశృంగు డున్నాడా? — ఇతరులు వారి స్థానములనుండి కదలవద్దు."

'నే నిక్కడ నున్నా' నని జంకుచు లేచి యతని స్థానమున నేకశృంగుడు నిలచినాడు.

'నీ వతి దుష్టయుతముగ వ్యవహరించు చున్నావు. నీవంటి పెద్దవిద్యార్థి పసిబాలురపై క్రౌర్యమునకు బూనుకొనుట సిగ్గు.

నీబోటివారిని శిక్షించుట మాకర్తవ్యము. అది శీలభద్రాచార్యులవారి యనుశాసనము. నీకు 'కోదండము'ను శిక్ష జెప్పినారు.

'నేను దానిని తిరస్కరింతు నని' ఏకశృంగుడనినాడు. విద్యార్థిలోకమున బహిరంగ ధిక్కారమునకు గలకలము చేకొనినది. మఱల ప్రథమ పృథువు చలింపని కంఠముతో ననినాడు. 'శిక్షను ధిక్కరించుట వలన నది వృద్ధిపొందుటయే గాని మరియొక ప్రయోజనము లేదు. కోదండము దగ్గరకు జేరుము' అని. మిత్రు లెవ్వరు వాక్సహాయ మొనర్పకుండుట వలన అతని కఠిన కంఠస్వరము విని ఏకశృంగుడు మొదట భయపడినాడు. కాని యతని యాజ్ఞను పాలింపలేదు.

'నీవు మా యాజ్ఞ తిరస్కరించినావు. సర్వసామాన్యముగ శిక్ష ననుభవింప నంగీకరింప కున్న బలవంతముగ నీకు శిక్ష జెప్ప వలసివచ్చును. వచ్చెదవా? రావా? ఎవరైన నతని నిటకు బట్టి తెండు.

ద్వితీయపృథువు, మరియొక స్థూలకాయుడైన విద్యార్థి యతని బలవంతముగ కోదండము కడకు జేర్ప లేచివచ్చినారు. ఏకశృంగుని హృదయము చలించినది.

'శిక్షననుభవించి నాలంద గౌరవమును కాపాడుము. శిక్షను స్వయముగ స్వీకరింపకున్న నిక నీయావరణమున నీవు విద్యార్థివిగ నుండుట కవకాశముండదు. అని ప్రథమ పృథువు పలికినాడు.

తప్పదని యతడు లేచి కోదండము దగ్గఱకు వచ్చి నిలువ బడుట జూచి మంగళుడు "ఇట్టిశిక్ష యనుచితము. నే నంగీకరింప" ననినాడు.

'అంగీకరింప కుండుటకు నీ వెవరు? అని పృథువు తిరస్కార దృష్టితో జూచినాడు.

"ఇది విద్యార్థిలోకమున నధికసంఖ్యాకుల యభిప్రాయము."

"ఆవిషయమును గూర్చి తరువాత నాలోచింతము. 'నీవు నీ స్థానమున నుపవిష్టుడ వగుము." అధిక సంఖ్యాకులు వారి యభిప్రాయమును జెప్పుకొనగలరు.

'ఏకశృంగుని గౌరవమును మనమే రక్షింపవలెను' అని మంగళుడు విద్యార్థుల వంక జూచినాడు. దానికి సమాధాన ముగ కొందఱు ముందుకు వచ్చినారు. వారితో సమయోచిత సంభాషణ మొనర్చి పృథువు వారిని శాంతింప జేసినాడు.

అపజయమువలన మంగళుని ముఖ మెఱ్ఱవారినది; క్రోధ మును దిగమ్రింగుకొని కూర్చొనినాడు.

పృథువు కోదండమును పట్టించి కాలముని శిక్షించినాడు. మొదటి కొన్ని దుష్టవాక్యములు పలికినందు కతనికి శిక్ష యదన మైనది. అతనిని దింపించి "ఇప్పుడు నీవు పొమ్మని" పృథు వాజ్ఞాపించినాడు.

నాలంద విద్యార్థు లందఱియెదుట నాగర్కో కట్టి శిక్ష జరిగి నది. 'మును పెన్నడు నత డొకరివలన నిట్లు శిక్షితుడ నగుదు'

నని కలనైన భావింపలేదు. అతని హృదయమున ప్రతీకార బీజములు నాటుకొనినవి. విద్యార్థులందఱు నిది యతని క్రూర కృత్యములకు దగిన శిక్షయని యామోదించినారు. నిశ్శబ్దముగ వారు జూచుచుండ పృథువు—

'మంగళా! నీస్థానమున నిలువుము. నిలువవా?' మంగళు డామోదవిరహితముగ దృష్టి సారించినాడు. 'ఇటు రమ్ము! నీతో కొంత మాటాడవలసి యున్నది'. ద్వితీయపృథు వాతని చేయి నెమ్మదిగ పట్టుకొని పృథువు నొద్దకు దీసుకొని వచ్చినాడు.

"విద్యాలయమున నధిక సంఖ్యాకులు ఏకశృంగుని శిక్షకు వ్యతిరేకులా?" మంగళుడు సమాధానము నీయలేదు.

"నీయొక్కని యభిప్రాయమే యధికసంఖ్యాకుల యభిప్రాయమా? సమాధానము లేదు.

"మీ సభనుగుఱించి వినినాము. నీ నిర్ణయము దెలిసినది. ఆసభలోని వ్యక్తులు మాత్రమే నలందావిద్యార్థులు కారు. విద్యార్థులలో నధికసంఖ్యాకులు వ్యతిరేకించినను నిట్టి క్రూర కృత్యము లొనర్చిన వారిని శిక్షింపకుండుట మాధర్మముకాదు. నీవు స్వతస్సిద్ధముగ దుష్టుడవు కావు. ని న్నెవరో తప్పుత్రోవన నడిపించుచున్నారు. తిరిగి యాలోచించుకొని సత్ప్రవర్తన నల వరచుకొనుము. నీమిత్రుడు బ్రహ్మయువు ననుసరింపుము. పొమ్ము! విద్యార్థులలో శాతకర్ణి, ధ్వజకేతువు లుదాత్తులవలె ప్రవర్తించి యాచిఱుతవాని ప్రాణముల గాపాడినారు. మీరును సత్ప్రవర్తకులై మన విద్యాలయమునకు బేరుప్రతిష్ఠల నినుమడింప జేయుడు."

విద్యార్థులు వెడలిపోవుచుండ "ఒక క్షణకాలము నిశ్శబ్దముగ నుండు" డని పృథువు వేదికరిగిన తరువాత ద్వితీయ పృథువు వేదికపై నిల్చి యిట్లనినాడు.

"ధైర్యముతో వేదికపై నిలచి మన యధికారములను, కర్తవ్యములను గుఱించి గంభీరముగ నుపన్యసించిన బ్రహ్మోయువునకు మా పృథువుల యభినందనములు. పృథువులమైన మేము మీ స్వేచ్ఛకు సర్వసామాన్యముగ భంగము గలిగింపము. కొందఱు వ్యక్తుల స్వేచ్ఛకు భంగము వాటిల్లు నపుడు మాజోక్యము తప్పదు. అది మీ క్షేమమునకే. 'కొదండము' వంటి కఠినశిక్షలు విధించుటలో మాకుత్సాహము లేదు. కాని దుష్టకృత్యములకు దగిన శిక్ష నొసంగవలె గదా! మన మందర మైకమత్యముతో వర్తించి మన విద్యాలయ గౌరవమునకు భంగ మగునట్టి ప్రవర్తనము నెటనైన నెదుర్కొందము".

"తప్పక" నని కొన్ని గొంతుకలు వినిపించినవి. విద్యార్థులు 'పృథువులకు జయవెట్టి సభాభవనమునుండి వెడలిపోయినారు'.

## ౧౩

ఒకనాడు సాయంకాలమున గయాశీర్షుడు, కాశ్యపు డిరువురు నేకాంతముగ భదంత శైలముపై పర్యటించుచుండ మంగళుడు, కుబ్జుడు నొకరి భుజముపై నొకరు వాలుచు, పోవుచు దూరమున నతి మైత్రితో నడుచుట వారు గమనించినారు.

కాశ్యపు డాదిక్కునకే జూచుచున్నాడు. విద్యార్థులపై దృష్టినిలిపి గయాశీర్షుడు 'అంత తీక్ష్ణముగ జూచుచున్నా రట నేమున్న' దని ప్రశ్నించినాడు. 'మంగళునిలో నే డింతటి మార్పునకు కారణమేమిటో నా కర్థ మగుట లేదు'

'మార్పేమిటి?'

"అత డిప్పు డెవరితో మైత్రి యొనర్చు చున్నా మీరు గమనించినారా?" "మీవలె నే నంత తీక్ష్ణముగ విద్యార్థుల గమనింపను."

కాశ్యపుడు కుశాగ్రబుద్ధి, విద్యార్థుల మనస్తత్వ మెట్లు మారుచున్నదో గమనించుటలో నతి నిపుణుడు. మంగళుని నూతనమిత్రుల నతడు పలుమారులు పరికింపలేదు. కాని యాతని యూహ లన్నియును సత్యములు.

మంగళుడు తెలివిగలవాడు. విద్యావిషయముల నతని శ్రద్ధలో గొన్ని దినములనుండి లోపము గనుపించుచున్నది. అతని ముఖమున పూర్వవర్చస్సు రూపుమాసి పోవుచున్నది. అనుమానమున కవకాశము గల్పించు కృత్యములలో నతడు పాల్గొను చున్నట్లు తోచుచున్నది.

కాశ్యపు డెట్లైన మంగళుని యతడనుసరించు చున్న దుష్ట మార్గమునుండి తప్పింప నెంచి యొకమా రేకాంతముగ నతనితో సంభాషింప రమ్మని కోరినాడు.

"మంగళా! రమ్ము" అని దీనమగు చిఱునవ్వుతో నాయాచార్యు డతని నాహ్వానించినాడు. దగ్గఱకుపోయి యతని భుజ

ద్వయముపై హస్తముంచి ముఖములోనికి జూచినాడు. మంగళు డాగురునర్యుని కన్నులు సూటిగ జూడ యత్నించినాడు; కాని జూపునిలుప లేకపోయినాడు. ఆచార్యుని కీస్వల్ప పరీక్షలో సర్వమవగత మైనది. అతడు దుష్టమార్గముల ననుసరించుచున్నాడనుట నిశ్చయము.

'మంగళా! నీముఖ మొక నిగూఢ గ్రంథముగ నున్నది. అందేమో విచిత్ర విషయములు ద్యోతక మగుచున్న' వని యాచార్యుడు గర్జితముగ బలికినాడు.

శాతకర్ణి, అమితాభులకు మరల మిత్రులలో యథాక్రమముగ సంచరించుటకు బక్షము దినములు పట్టినది. అమితాభుడు నేడు శాతకర్ణి కక్ష్యలో నుండవీలులేదు. మరల నమితాభుని హృదయమున భయము స్థానము కల్పించుకొనినది. శాతకర్ణి నెట్లైన నతని కక్ష్యలోనే నివసించు నవకాశమును గల్పించుమని వేడినాడు. మిత్రుడతని కోర్కెను దీర్చినాడు.

ఇట్టి చిత్రములలో సంవత్సర మంతము కానచ్చినది. మరల పరీక్షలలో బ్రహ్మాయువు ప్రథముడైనాడు. శాతకర్ణి యతని కక్ష్యలో నుత్తముడు. కేతుధ్వజుడు శాతకర్ణి తరువాత స్థాన మాక్రమింప లేకపోయినను చతుర్థస్థానమును స్వీకరించినాడు. మంగళుడు పరీక్షలలో బాగుగ వెనుకబడినాడు.

బిరుదప్రదానదినము వచ్చినది. ఆనాటి బిరుదప్రదాన మొనర్చువారు రేవా సంస్థానాధిపతి, యతని ధర్మపత్ని గోమతీదేవి. శాతకర్ణికి వారి పరిచయభాగ్యము లభించినది. బ్రహ్మా

యున్న వారి కుమారుడు నాలందలో నతడు నొక సామాన్య విద్యార్థి. అనేకపర్యాయములు తల్లిదండ్రులకు వ్రాసిన లేఖ లలో నతడు శిఖిశాతకర్ణి శిక్షణశీలముల గురించి వ్రాసి, యతనిని "విద్యార్థివీరు"డని పొగడినాడు.

నాలందకు విచ్చేసి ఆచార్యుల స్వాగతమును స్వీకరించిన యనతి కాలముననే రేవాప్రభుపు నతని ధర్మపత్ని శాతకర్ణి పరి చయము సర్థించినారు. బ్రహ్మయ్యపు తక్షణమే యతనిని బిలుచు కొనిపోయి వారిపరిచయము జేసినాడు. శిఖి నాలందాలోని సమస్తవైచిత్ర్యముల నామిత్రునితల్లిదండ్రుల కెరిగించుటలో విశేష సాయమొనర్చి వారియనురాగమునకు బాత్రుడైనాడు.

ఈరీతిగ శాతకర్ణికి నాలందావిద్యాలయమున ప్రథమవత్స రము గడచినది. మొదట కొన్ని కష్టముల నెదుర్కొన వలసి వచ్చినను నాతని కాజీవితము సంతృప్తికరముగ నున్న దని తండ్రికి వ్రాసిన లేఖలో నతడు పేర్కొనినాడు. నాలంద నాల్గు ద్వారముల కడ మృగరథములు, ఖరరథములు, శిబికలు, నశ్వ శకటములు దశదిశలనుండి వచ్చి నిలచినవి. విద్యార్థు లంద ఱను సెలవులకు స్వగృహముల కరుగుచుండుటయే యిందుకు కారణము. ప్రతివాహనము నుండియు హర్ష నినాదములు విని పించుచున్నవి.

శాతకర్ణి చనుప్రతో 'మిత్రుడు బ్రహ్మయ్యపు సెలవులకు మాయింటికివచ్చి కొంతకాల ముండుట కంగీకరింపు' డని రేవా ప్రభుపును గోరినాడు. అతని వినయవిధేయతల కతడు ముగ్ధుడై యందుల కంగీకరించినాడు. 'మరల, శిఖి! నీవును బ్రహ్మ

యుపుశో మాయింటికి దప్పక రావలెను 'సుమా' యని గోమతీదేవి యతనిచే 'తప్పక వత్తు' నని వాగ్దానము గైకొని కుమారుని బంపుట కనుమతించినది.

కొంతకాలము శాతకర్ణి యింట, మఱికొంత కాలము బ్రహ్మయుపు గృహమున నాయిరువురు మిత్రులు సంతోషముతో సెలవులు గడిపి తదనంతరము నాలందకు జేరుకొనినారు.

## ౧౪

శిక్షశాతకర్ణికి విద్యార్థిజీవితమున నాలందలో రెండు సంవత్సరములు గడచినవి. ఈవర్షద్వయమున నెన్నో పరిణామములు సంభవించినవి. వయోవృద్ధులైన విద్యార్థులు, 'పృథుసులు' విద్యపూర్తి జేసుకొని వెళ్ళిపోయినారు. బ్రహ్మయుపు, మంగళుడు, ధ్వజకేతువు, మరి యితర మిత్రులు కొందఱు పృథుసులైనారు. విశాఖావి, ఏకశృంగుడు వంటి దుష్టవిద్యార్థులు సమస్త దుష్కృత్యముల జొల్గొనుచున్నారు. కాని బయటపడక తప్పించుకొనుచున్నారు.

రేవా సంస్థానాధీశ్వరుని కోరిక ననుసరించి కాశ్యపుడు సామాన్య జీవితధర్మముల బ్రచార మొనర్ప నాదేశమున కేగి నాడు. గయాశీర్షుడు బుద్ధగయలో కొంతకాలము విశ్రాంతి గైకొందునని ప్రార్థించి శీలభద్రాచార్యుని యనుమతితో నట నివసించుచున్నాడు.

పూర్వోక్త కారణముల మూలమున నాలందలో వెనుకనున్న క్రమశిక్షణము కనుపించుట లేదు. నూతనముగ ప్రవేశించిన విద్యార్థులలో శాతకర్ణి సోదరుడు శ్రీముఖుడు చిత్రమైనవాడు. అతడు ప్రవేశించిన కక్ష్యకు పృథుపు నేడు మంగళుడు. మంగళుడు ఏకశృంగాది దుష్టులసహాయముతో ప్రత్యేకముగ నొక విచిత్రమార్గము ననుసరించి విద్యాలయమందలి యాచారముల కై విప్లవమొనర్ప యత్నించుచున్నాడు. వారి కుటిల తంత్రములకు శ్రీముఖశాతకర్ణి యొక యాటంకము. అతఁడా మిత్రబృందమున నొదుగువాడు కాడు. అతని నెట్లైన దమపక్షమునకు ద్రిప్పుకొన నొక జిత్తులమారి విద్యార్థి నతనితో నేస్త మొనర్ప మంగళుడు ప్రోత్సహించినాడు. కాని లాభము లేకపోయినది. మంగళు డతనిని తన కక్ష్యనుండి పంపివేసినాడు.

శ్రీముఖు డతని కక్ష్యలో నున్నపుడు మంగళుడు మత్తును గల్పించు నాసవముల ద్రాగుమని బలవంత పెట్టించినాడు. అతఁ డంగీకరింప కున్న నతని ముఖముపై నాసవ ముమియించుట, పాదతాడన మొనర్చుట జేయించినాడు. వారి దుష్కృత్యముల నెల్ల శ్రీముఖుడు వీరునివలె భరించినాడు. స్థిరచిత్తముతో వారి నెదుర్కొనుట కతనికి సాయపడిన మిత్రుడే సుజాతుడు. ఇతర సహపాఠకులు శ్రీముఖుని శిక్షించు విధానమును గూర్చి యతఁ డెన్నో మారులు మంగళునితో జెప్పినాడు. అట్టి క్రూరచర్యలు జరుగకుండ జూడవలసినదని కోరినాడు. ఆచర్యలవలన నతనికి విశేషప్రయోజన మున్న దని మంగళుడు సమాధానము జెప్పి 'శ్రీముఖుని విషయమును నాయొద్ద పదే పదిగ ప్రస్తావింపకు' మని పలికినాడు.

కౌముదీచాతుర్మాస్యాంత్యదినమున విద్యార్థులు మత్తత గల్పించు పుష్పాసవముల దెచ్చి త్రాగుచుండుట కలవాటు పడినారు. ఎవరైన నుపాధ్యాయులు వచ్చి వాసనను గ్రహించి ప్రశ్నించిన నెవ్వరును సమాధానము జెప్పకుండునట్లు నిశ్చితమైనది. వారు ప్రమాణము లొనర్చినారు.

అందుకు శ్రీముఖు డంగీకరింప లేదు. ప్రతిదినము రాత్రి యతనిని ప్రమాణమొనర్పు మని వారు బలవంత పెట్టినారు. ఒకదిన మాతనిని కఠినముగ కొట్టి తిట్టినారు. అత డంగీకరించుటకు సిద్ధపడి ప్రమాణమొనర్ప పారమిత గ్రంథమును శిరముపై కెత్తి కొనబోవుచున్నాడు. మఱియొక విద్యార్థి 'అత డొనర్చిన నేను నంగీకరింతు' నని యన్నమాట చెవిబడినది. వెంటనే యతనికి మఱియొకడును తనతో బతన మగుట కష్టము గల్గించినది. అతడు "నేను ప్రమాణ మొనర్పలేను. నాజీవితమున నెన్నడు నే నసత్యమాడ లేదు. నన్ను బలవంత పెట్టకు" డని ప్రార్థించినాడు. దుష్టవిద్యార్థుల ముఖమున క్రోధరస ముప్పొంగినది. అతనిని యనరాని మాట లనినారు; నిదురించు శయ్యపైనుండి పాదముల బట్టుకొని క్రిందికి దిగలాగినారు. పాదతాడనములతో నతని శరీర మాపాదమస్తకమును నొప్పించినారు. కాని యతడు లొంగలేదు; ఉదాత్త వ్యక్తివలె నాకష్టముల నెల్ల భరించినాడు.

తనకష్టముల శ్రీముఖు డింతకు బూర్వమెన్నడును శిక్షశాత కర్ణికి జెప్పుకొనలేదు. నే డతనితో జెప్పుకొని హృదయావేదన నపనయించుకొన నిశ్చయించి సోదరుని నివాసగృహమున కేగి

నాడు. అతనితో నెట్టి యభియోగముల శ్రీముఖు డెవ్వరిపై నను జెప్పలేదు. తండ్రి యతనిని మఱియొక విద్యాలయమునకు బంపుట కవకాశ మున్నదేమో యని సోదగు నడుగ నేగినాడు.

" శ్రీముఖా ! నీవిద్య బాగుగ సాగుచున్నదా?"

"నే నతి క్లిష్టస్థితిలో నున్నాను." 'ఎట్టి దోషము నా సర్వ లేదు గద. నాయెదుట నెట్టివిషయమైన జంకులేక నీవు చెప్పవచ్చును.'

''లేదు. దుష్టకృత్యమున కంగీకారము నీయలేదని వారు నన్ను కష్టపెట్టుచున్నారు.''

" అంతేనా ? — కన్నీరు తుడుచుకొనుము. కష్టము నీడేర్ప భగవానుని ప్రార్థింపుము. నీవంగీకరింపకున్న నీచే నెవ్వరైన నెట్టి దుష్కృత్యమును జేయింపలేరు."

"నా నివాసగృహ మొక నరకముగ నున్నది. సుజాతుడు తప్ప నన్ను దయతో జూచు సహపాఠి యొక్కడు నందులేడు."

"వారు నీకెట్టి కష్టముల గల్గించినను దుష్కృత్యములకు లొంగకుము".

"నాచే వారెన్నడైన బలవంతముగ నట్టిపనులు జేయించుటకు బూనుకొనినారా, నేను దిరిగి యింటికి పోదలచుచున్నాను. ప్రతినిత్యము త్రికాలముల నన్ను వారు దూషించుచున్నారు; పాదతాడన మొనర్చుచున్నారు; హింసించుచున్నారు."

"నిజమా ! నిన్ను వారంత నొప్పించుచున్నారా ? అమితాభుని వలన వారు నిన్ను కష్టపెట్టుచున్నా రని వినినాను.

కాని వారి ప్రవర్తన మింత దుష్టముగ నున్నదని నేను భావింప లేదు. వారిలో నెవ్వరైన నా కంటబడిన నాడు వారిపని బట్టించెదను."

"అన్నా ! భరింప శక్యముగాక చెప్పబోయినాను గాని వారు నీకు నివేదింపవలదని నాచే ప్రమాణము చేయించుకొనినారు."

"నిన్నా కష్టమునుండి మార్పింప యత్నింతును. కొంత కాలము నీ వోపిక బట్టవలయును. వారి దుష్కృత్యములకు లొంగకుము. ప్రమాణ మొనర్పుము."

నమ్రభావముతో శ్రీముఖుడు సోదరుని హస్తమున చేయి నుంచి ప్రమాణ మొనర్చినాడు.

"నీవిషయమై నేను బ్రహ్మయ్యతో మాటాడెదను. అతడు నేడు వృద్ధులకెల్ల బెద్ద. మంగళునితో జెప్పి యేమైన జేయింపగలడు."

"మంగళుడా ? వారి కండగ నున్నాడు. నాకు సాయ మొనర్ప నిచ్చగింపడు."

"కానిమ్ము ! నీవు వీరాధివీరులు జన్మించిన వంగడమున బుట్టినావు. ధైర్యము వహింపుము."

ఘంటికానాదము విని సోదరు లిరువురును భోజనశాలవైపు ప్రయాణమైనారు.

శ్రీముఖుడు భోజనానంతరము వసతిగృహమున కేగి శయ్యపై బరుండినాడు. కొలది కాలములో నతని సుఖనిద్రకు భంగము వాటిల్లు నని యత డెరుగును.

కుశద్రుముడు తన దుష్టపరివారముతో నతని కక్ష్యలో ప్రవే శించినాడు. "ఇది కడసారి ప్రశ్న. ప్రమాణ మొనర్ప నంగీక రింతువా ? లేదా ?"

"ఆ ఉత్పలుడును మొనగాడు. జాగ్రత్త! ఒడలుదగ్గఱ నుంచు కొని మరి యాలోచించి ప్రమాణ మొనర్పుడు" అని యొక గొంతుక వినిపించినది.

కుశద్రుముడు వీపు వెనుక దాచిన వెదురు బెత్తమును దీసి ఝుళిపించినాడు. ఉత్పలుని ముఖమున నెత్తురు చుక్క లేదు. భయపడి వెంటనే ప్రమాణ మొనర్చినాడు.

"బాగున్నది. శ్రీముఖా! నీవు నిట్లు దారికి రమ్ము. మిత్రుడ వని యింతకాల మశ్రద్ధ జేసినాము." అని ఫణి యనినాడు.

"నీవు నాకు మిత్రుడవు కావు."

ఫణి క్రోధముతో బడగవిప్పి బుసలు గొట్టుచు పైబడు నాగమువలె నతనిపై బడినాడు. శ్రీముఖుడు శక్తికొలది పోరాడి యతనిని క్రింద బడవైచినాడు. కుశద్రుముడు రెండుచేతులతో నతని బట్టుకొని 'మరల నొకమారు వానిపై కేగిన ప్రాణములు దక్కవు' అని బెదరించినాడు. 'ప్రమాణ మొనర్పు' మని గద్దించినాడు.

"కుత్తుకలో ప్రాణమున్నంతవర కా కృత్య మొనర్పను." అని నిశ్చయముగ శ్రీముఖుడు బలికినాడు.

కుశద్రుముడు వెదురుబెత్తముతో నతని వీపుపై నొకదెబ్బ కొట్టినాడు. శ్రీముఖుడు పెద్దపెట్టున కేకపెట్టి నేలపైబడి నురు

గులు గ్రుక్కుచున్నాడు. అతనికి స్మృతిదప్పినది. ద్వారమును త్రోసికొనివచ్చి సుజాతుడు పట్టరాని కోపముతో ప్రవేశించినాడు. వెంటనే మంగళుడు నచ్చటికి జేరుకొనెను.

“ఇతనిని మీరేమొనర్చినారు? రక్తము కదుము గట్టినదే. మంగళా! చూడు. మీరు రాక్షసులు.” ప్రక్కవారిని చేతులతో నెట్టిపారవేయుచు బలమైన చేతులతో కుశధ్వజుని యంస భాగముల బట్టుకొని, “ఈక్రూరకృత్య మొనర్చినది నీవేనా?” యని సుజాతు డడిగినాడు.

“మాజోలి నీకెందుకు? నీపని యేదో యేడ్చుకొనుము”.

‘ఔను. ఏడ్చుకొందును. నిన్ను నేడ్పింతు చూడు’ మని యతని చేతనున్న వెదురుబెత్తమును లాగుకొని యతని వాచి పోవునట్లు కొట్టినాడు. మంగళు డడ్డువచ్చుటకు వెరచినాడు.

కుశధ్వజుడు బాధతో, నవమానముతో నటునుండి నెమ్మదిగ తప్పుకొని పారిపోయినాడు.

“మీరును మీకక్ష్యల కేగు” డని కఠినముగ నతడు బెదరింప నటనొక పురుగైన మిసులలేదు.

“మంగళా! పృథువు వయ్యు నీవు నీకర్తవ్యమును సక్రమముగ. నిర్వర్తించుటలే” దని యతడన నా యుద్రేకమున బెత్తముతో దన్నును ‘బూజించు’ నేమో యను భయమున సమాధాన మీయక మంగళుడు నెమ్మదిగ జారుకొనినాడు.

శ్రీముఖునికి స్మృతి వచ్చినది.

" ఇకముం దెవ్వ రైన శ్రీముఖుని యొంటిపై జేయి వైచిన జాగ్రత్త! " యని సుజాతుడా విహారమున నున్న ప్రతికక్ష్యకు నేగి విద్యార్థుల బెదరించినాడు. కన్నీరు మున్నీరుగ నేడ్చుచున్న శ్రీముఖునోదార్చి యతడు శాతకర్ణిని గలుసుకొన నేగినాడు.

శ్రీముఖుని మిత్రు డొకడు వచ్చి గౌరవమును వెలిబుచ్చుచు నతనితో నిట్లనినాడు.

"మిత్రుడా ! నీవే జయించినావు."

౧౩

నాలందలో నాతతాయుల ప్రభావ మస్తమించుచున్నది. వారు పృథువులపై బెద్దయెత్తుగ నొకకుట్ర బన్నుచున్నారు. విహార, విద్యాలయ ప్రాకారములపై నిలచి ఏకశృంగుడు నతని మిత్రులు వారిపై నొంటరిగ జూచి రాళ్లు రువ్వుచున్నారు. మొదట నవి పరిహాస ప్రాయము లని వారు భావించినారు. దుష్టు లంతటితో నాగలేదు.

ఉపాధ్యాయులపై నల్లే శిలల బ్రయోగించు చున్నారు. పృథువులు సమస్త కక్ష్యలలో నీశిలావృష్టుల గురించి ప్రసంగించినారు. విద్యార్థు లిట్టి ప్రకటన 'అవమానకరము' లని యొక విప్లవమును ఏకశృంగుని నాయకత్వమున లేవదీసినారు. కాని బ్రహ్మయువు, నతని మిత్రులైన యితర పృథువులు దానిని ప్రారంభ దశలోనే తుదముట్టించినారు.

'నాయకుల నందఱ బట్టుకొని కఠినముగ శిక్షింప వలసిన' దని శాతకర్ణి బ్రహ్మయ్యతో జెప్పి యొప్పించినాడు.

మరునాఁ డుదయమున మరల స్వల్పముగ శిలావృష్టు లారంభ మైనవి. పృథువుల జాగ్రత్తగ నన్నిమూలల గంటిలో వత్తిడు కొని గమనించు చున్నారు. దొంగలు పట్టుబడినారు.

"ఏకశృంగా! నీకేమి దుర్బుద్ధి? పెద్దవాడవై యిట్టి దుష్కృత్యములొనర్చి యితరుల బ్రేరేపించి దుర్నీతిని బోధించు చున్నా" వని శాతకర్ణి గద్దించి పలికినాడు.

"నాయిష్టము. నీవు నోరుమూసుకొను" మని ఏకశృంగు శోకవిషపు నవ్వునవ్వినాడు.

"స్వల్పకాలములోనే దీనికి దగిన ఫల మనుభవింతువు. రమ్ము! లేకున్న నెదుర్కొన సిద్ధపడు" మని శాతకర్ణి తిర స్కృతదృష్టు లతనిపై బరపినాడు. ధ్వజకేతువు ముందుకువచ్చి "నీవు బ్రహ్మయ్యపై శిలల బ్రయోగింప నేను కళ్ళారజూచి నాను. పృథువుల యొద్దకు ర" మ్మని కుశద్రుముని బిలచినాడు.

"నేనచటికి మహానందముతో వచ్చెదను. ఆ 'దుక్కిపిట్టలు' నన్నేమి జేయగలవు?"

"అపును మహానందముతో వచ్చెదవు. నాలందనుండ యంతి కంటె మహానందముతో వెళ్ళిపోయెదవు." ఈ వెక్కిరింపునకు విద్యార్థులు పగలబడి నవ్వినారు.

"విజితాపీ! నీవు విసరినరాయి శాతకర్ణి ముఖమున దగిలి నది. నిన్న నమృతనన్యోపాధ్యాయులపై శిలావృష్టి కురిపినది నీవే నని నానమ్మకము."

"నేను విసరలేదు."

"నీ వసత్య వాదివి."

"నీకు నాపై నీర్ష్య."

"నా జీవితమున నిన్ను గుఱించి కలలోనైన యోచింపలేదు.— నిన్న నాచార్య కాశ్యపులపై రాయివిసరినది నీవు కాదందువా?" యన్న బ్రహ్మయువు కఠినోక్తికి విజితావి ముఖము వివర్ణమైనది. భయకంపిత స్వనముతో నతడు 'నే నెరుగ' ననినాడు.

'నీవుపిరికిపందవు. ధైర్యముతో నంగీకరింపలేవు. విద్యార్థుల ప్రేరేపించు నిన్ను గనులార జూచినాను. నీవు నా ఏకశృంగుడు లేకున్న విద్యార్థు లిట్టి యకృత్యముల దలపెట్టువారు కారు. నీవు విసరిన రాయికే ఉత్తరుని శిరముపై బొప్పికట్టినది.' అని తుంది లుడు తొందరపడినాడు.

'అతనిని శిక్షించుట మాకు వదలిపెట్టుము' అని శాతకర్ణి యతనిని వారించి, 'విజితావీ! నీతప్పిదము నిప్పటికైన నంగీకరించి నావా' యని బిట్టుగ బలికినాడు.

'నేను విసరినది స్వల్ప మగు శిలాఖండము'. శాతకర్ణి తిరస్కారముతో బెదవి విరిచినాడు.

'నీవు ఉత్తరుని క్షమాపణ వేడుకొనుము. చాలును.

'అవసరము లేదు. క్షమాపణ వారి కొక లెక్కయా? ఇటువంటివాటికి యీదుష్టు లెన్నడో సిద్ధపడినారు. వారి పతన మునకు లో తందదు. లేకున్న నిట్టి దుష్కృత్యములకు బూను కొందురా' అని తుందిలు డనినాడు.

"నీవు వలదనినను నతడు క్షమాపణ జెప్పక తప్పదు. అది నాలందా నిలయాచార" మని శాతకర్ణి యనినాడు.

కుశ్రద్రుముడు 'దాని నంగీకరింపవల' దని విజితావితో ననినాడు.

'ఎవరది ? కుశ్రద్రుముడా ?' — అతండు నీవలన చెడిపోవు చున్నా డని ధ్వజకేతు వనినాడు.

'క్షమాపణపత్రమును బఠింపుము' — అని పత్రికను ధ్వజకేతువు విజితావి చేతికిచ్చినాడు.

విజితావి నెమ్మదిగ దానిని జూచి యేమో గొణిగినాడు. 'మాకు వినిపింపలేదు', 'పెద్దగ. మోకాళ్ళపై నిలచి సాష్టాంగముగ' యని మిత్రులు గొడవపెట్టినారు. వెనుకనుండి కోపముతో తుందిలుడు వచ్చి యతనిని మోకాళ్ళపై కూర్చుండబెట్టి క్షమాపణ పత్రమును జదివించినాడు.

'ఇకముందిట్టి వెన్నడును జరుగవని నేమాశించుచున్నాము. పృథువు లుండుట మీ క్షేమమునకే. లేకున్న విజితావి వంటి దుష్టులచేతులలో మీ కెంతప్రమాదము. మీరు పృథువుల నెందుకు దిరస్కరింప నెంతురో నా కర్థ మగుట లేదు. మిమ్ములను ప్రేరేపించువారు మూర్ఖులనిమున్నుందు మీరు గ్రహింపగలరు. మీరు స్వతంత్రవర్తకులై యుండ నిశ్చయించుకొనిన మిమ్ము దుర్మార్గమున నడుపగలవా డెవ్వడు ?'

విద్యార్థులందరు బ్రహ్మయువు పలికిన యీసామాన్యవాక్యముల కమితానంద మొందిరి. అట్టివారు తమ పృథువు

లలో బెద్దగ నుండుట వారి యదృష్ట మని భావించిరి. బ్రహ్మో యువు వంటి విద్యార్థి పూర్వమెన్నడును నాలందలో విద్య నేర్చుకొన రాలేదని యేకగ్రీవముగ వారు నిశ్చయించిరి.

'కనిష్ఠసోదరులారా ! మిమ్ములను వారి దౌష్ట్యములకు సాధనములుగ కొంద ఱుపయోగించుచున్నారు. వారి వలలో జిక్కుపడకుడు. స్వతస్సిద్ధముగ మీహృదయముల క్రూరతలేదు. అందువలన మిమ్ము ముందు జూచినను శిక్షింపక నౌదార్య ముతో విడిచిపుచ్చుచున్నాను. దీనిని గ్రహించి బుద్ధిమంతులై ప్రవర్తింపు" డని శాతకర్ణి వయస్సున జిన్నవారితో బలికినాడు.

విద్యార్థు లందఱును సభాభవనమునుండి వెళ్ళిపోవుచున్నారు. ధ్వజకేతువు మయూరుని భుజముపై హస్తముంచి యాప్యాయ ముగ నెటకో బిలచుకొనిపోయి 'నీతిమంతుడవు గ' మ్మని యుద్బోధించినాడు.

ఏకశృంగుడు, కుబ్జుడు పృథువులు పిలచిన వారిని తిరస్క రించి యగౌరవించుట కవకాశము లభించు ననుకొనినారు. కాని వారు తమకంటె శారీరక శక్తివంతులు. నైతికబలముగల పృథువర్గము గౌరవముతో వారి యాజ్ఞల బాలించుట గమ నించిన తరువాత నట్టి క్రియకు బూనుకొన వారికి ధైర్యము చాలలేదు. పృథువులు వారిచే మరల నిట్టి దుష్క్రియలకు బూనుకొనమని ప్రమాణ పత్రికలు వ్రాయించుకొని యూరక వదలి పెట్టినారు.

౧౬

శీలభద్రాచార్యుడు తిరిగి నాలందకు విచ్చేసినాడు. ఆగురు దేవుడు లేని కాలమున పుట్టిన చిక్కుల నన్నిటి నాయన స్వల్పకాలములో నిర్మూలించినాడు. సమస్తము నొక నూతన పరిణామము నొందినది. శ్రీముఖ శాతకర్ణి వంటి విద్యార్థులకును నాలంద యను నభిధానము, మమకారము కలుగ నారంభించినది.

దుష్టులు నంత వేగముగ పృథుస్తులకు లొంగిపో దలపక 'నవకాశము లెపుడు వచ్చునా' యని కాచుకొని కూర్చొని నారు. మంగళుని సహాయము లభించి నపుడెల్ల వారొక 'రభస' చేయ దలపెట్టినారు.

పరిసరగ్రామముల నుండి విద్యార్థులకై తినుబండారముల నమ్ముకొన పేదవారు గంపలతో వచ్చి వ్యాపారము జేసుకొని క్షేమముగ వెడలుచుండుట యనాదినుండి పరిపాటియైనది. విద్యార్థులు వారితో బేరములు గావించి కావలసిన ఫలాదుల విలువకొని సగౌరవముగ వారికి ధనమిచ్చి పంపుచుందురు.

సుజాత కడు పేదరాలు; వృద్ధు. పోషించి పాలించు 'నా' యను వా రెవ్వరు నామెకు లేరు. ఆమె ఫలములతో నింపిన బరువైన గంప నెత్తుకొని నాలందా వీధులలో ప్రవేశించి యమ్ముకొనుచున్నది. ఒక మాసము కష్టపడిన యామె గ్రామములో మూడు మాసములలో వచ్చిన డబ్బుతో జీవితము గడుపుకొన దలపోసినది. నేడో రేపో పండుగ పండి

రాలిపోనున్న సుజాత యన విద్యార్థుల కమితాభిమానము.
ఆమె నొక చోట కూర్చుండ బెట్టి ఫలముల నన్నిటి నొక
రమ్మి ధనమిచ్చి యింటికి బంపుచుండెడివారు. తట్ట నెత్తుకొను
నపుడును, దించుకొనునపుడు నామెకు జేయూత నిచ్చుచుండెడి
వారు. మార్గమధ్యమున గొంతదూరము వారే మోసుకొని
వచ్చుటయు గలదు.

శ్రీముఖశాతకర్ణి కామెపై ప్రత్యేకాభిమానము. అతని మిత్రు
లతో నామె కెట్టికష్టముల గల్గింప వలదని యనేకపర్యాయ
ములు హెచ్చరించినాడు.

ఆనాడు సుజాతను శ్రీముఖ శాతకర్ణి తన నివాసగృహమునకు
బంపుకొన బిలచినాడు. అత డామెతో బేరమాడు సమయ
మున గొందఱు దుష్టు లామెను జుట్టుముట్టి ఫలముల నెత్తుకొని
తలకొక దిక్కున కేగినారు. మిగిలిన పళ్ళగంపను నేలపై
బోర్లించి గగ్గోలుపెట్టి కలకలలతో గంతులు వేసినారు.

శ్రీముఖ శాతకర్ణికి బట్టరాని కోపము వచ్చినది. ఏమి
చేయగలడు? అన్ని ఫలముల ధనమును నిచ్చుకొనుమని
సుజాతకు దన యొద్దనున్న ధన మిచ్చినాడు. అది చాలదు.
శతపుష్పుడు దూరముగ విద్యార్థు లెత్తుకొని పోయిన ఫలముల
నన్నిటిని రాసిపోయించి సమానముగ బంచిపెట్టుచున్నాడు.

ఆ దృశ్యము శ్రీముఖ శాతకర్ణి కంటబడినది. అట్టి దుష్కృ
త్యము నతడు సహింపలేక నతివేగముతో నచటికే బరుగెత్తి
శతపుష్పుని పైబడినాడు. అతడు మొదట నిర్ఘాంతపోయినాడు.
తెలివి దెచ్చుకొని జుట్టునున్న దుష్టుల నుసికొల్పినాడు. కాని

వారు పృథువులు విన్న గఠినముగ శిక్షింతు రను భయముతో నతనికి తోడ్పాటొసంగ వెనుదీసినారు.

శతపుష్పుడు బయటపడ మార్గ మాలోచించి 'ఇవి సుజాత ఫలములు గావు. మేము వీనిని మరియొకని యొద్ద నిన్న విక్రయించుకొనినా' మని యసత్యమాడినాడు. శ్రీముఖుడు "పేదరాలి ధనమపహరించుట మహాపాతకము. అబద్ధమాడు టలో నేమానందమో నాకర్థమగుట లేదు. ఈఫలములు సుజాతవి కావా ? మీ రామె గంపపై బడి వీని నెత్తుకొని పారిపోవుట నాకళ్ళతో జూచినా" నని ఖండితముగ బలికినాడు.

"అయిన నీ కన్నులలో దృష్టిదోష మున్న దన్నమాట ! జరుగనివి జరిగినట్లు వానికి కనుపించునేమో !" యన ప్రక్క నున్నవారు శతపుష్పుని మాటలకు శ్రీముఖుని గేలిచేసినారు.

"నీవు ప్రతిస్వల్ప విషయమునను జోక్యము గల్గించుకొని మాపై లేడిపిల్లవలె దుముకుచున్నావు. మీసోదరుని జూచి వెరతు మనుకొనుచున్నా వేమో ! మేము పిరికివారము కాము. జాగ్రత్త" యని మయూరుడు ముందుకువచ్చి బెదరించినాడు.

"వీడికి తగిన శాస్తి జేయక జూచెద వేమి ? శతపుష్పా వీస్సపై నీవొకమారైన జేయిజేసుకొనకున్న వీడు నోరుమూసుకొనడు."

"నీ యభిప్రాయ మేమిటో యర్థమగుట లేదు." "నీవు సుజాత ఫలముల గాజేసినావు."

అతని నోటివెంట వాక్యము పూర్తిగాక మునుపే, మయూరుడు శాతకర్ణి చెంపపై నొక దెబ్బకొట్టినాడు.

"మయూరా! ఇందు స్త్రీప్రసక్తి లేదు. నేను స్త్రీతో మాట్లాడ లేదు. అకారణముగ నన్నిట్లు కొట్టినావు; నన్ను పోరాటమునకు బురికొల్పుచున్నా" వని శ్రీముఖుడు మఱల నతనికి చెంపదెబ్బతో సమాధానము జెప్పినాడు.

ఆయిరువురును సమాన శక్తి బలసంపన్నులు. పోరాటము కొంతసేపు సాగినది. ఇరువురి శరీరములు రక్తప్లుతము లైనవి. ఇంకను బోరాడుచున్నారు. దూరముగ ధ్వజకేతువు, స్వాతి రత్నోదధి బాండారమునుండి తిరిగివచ్చుచు విద్యార్థులగుంపును జూచినారు.

ధ్వజకేతువు 'శ్రీముఖుడు — మయూరుడు!' వీరిరువురును బోరాడుకొనుటలో యుక్తము. లేకున్న శ్రీముఖుడును వారిలో నొకడై చెడిపోగలదనినాడు.

"పాపము! బహుకాలము నుండి పోరాడు చున్నట్లున్నారు. నీవు పృధువువు. వారి పోరాటము మాన్పించి యిరువుర మఱల మిత్రులుగా బంపివేయ యత్నింపు" మని స్వాతి యనినాడు.

గుంపును జేతులతో బ్రక్కకు సర్దుచు 'రంగస్థలమున' బ్రవేశించి "ఇక చాలింపుడు!" అని కేకపెట్టి 'కలహ మెందుకు వచ్చినది?' అని యడిగినాడు.

' ఇరువురుకు సుజ్జీ కుదిరినది. పోరాటమును మాన్పింప వద్దని యెవరో పలికినారు.

' కారణ మేమిటి ? నాకు తెలియవలెను.' అని ధ్వజకేతువు ప్రశ్నింప ' తప్పుగాడు ' సుజాత ఫలముల దొంగిలించినా వని శతపుష్పుని నిందించి ' పైబడబోవ నితడడ్డుపడినా ' డని కుశద్రుమము డనినాడు.

" తప్పుగా డెవరు ?" " శ్రీముఖుడు "

స్వాతి " మీరిరువురు నిటు రండు — మిత్రులై నామని పలికి యాలింగిన మొనర్చుకొనుడు " అని శ్రీముఖ మయూరుల గోరినాడు.

శ్రీముఖుడు క్షణకాలము వెనుదీసి చిరుతకరముల జాచినాడు. మయూరుడు 'శతపుష్పుని వృథగ నిందించిన యసత్యవాది నాలింగన మొనర్చుకొనుటకు నావమానస మంగీకరించుట లే' దనినాడు.

" నీవే యసత్య వాదివి. ఆఫలములతో సుజాత కడకేగిన నెవ్వ రసత్య వాదులో తేలగలదు " అని శ్రీముఖు డని నాడు.

స్వాతి వారిరువురతో సుజాతకడ కేగి ఫలముల జూపించి ' ఇవి నీవేనా ?' యనినాడు. సుజాత పట్టరాని సంతోషముతో నాతనికి మ్రొక్కుచు ఫలములు పోయినవను దుఃఖముతో గార్చిన కన్నీరు దుడుచుకొని ముఖముపై నాశాజ్యోతి ప్రకటించినది. స్వాతి యామెకు గొంతధన మిచ్చి ' యిక బొమ్ము మరల నిన్నెవ్వ రీయావరణమున నిట్లు కష్టపెట్ట ' రనినాడు.

దొరకని మరి కొన్ని పండ్లకై స్వాతి, ధ్వజకేతువులు దుష్ట విద్యార్థుల వెదకుచున్నారు. వారందుకు వ్యతిరేకించినారు. ఈ వాక్కలహము చెవినబడి దూరముగ పోవుచున్న మంగళుడు వచ్చి 'వారిని వెదకుటకు మీకేమియు నధికారము లేదు.

"అరుగో మన పృథుపులలో పెద్దలు — బ్రహ్మాయువు, శాతకర్ణి వారే సీరిసి వెదకుదురు" అని వచ్చుచున్న వారిని జూపించి ధ్వజకేతు వనినాడు.

"అతి స్వల్పవిషయమున కింత రాద్ధాంత మెందులకు? — శ్రీముఖుడును సామాన్యుడు గా" డని మంగళు డనినాడు.

"శ్రీముఖా! ఏమి టది?" యని శిఖిశాతకర్ణి దగ్గఱకు వచ్చి తమ్ముని క్షతగాత్రమును, రక్తసిక్తముఖమును బరిశీలించినాడు.

"కలహించు కొనినాము. సుజాత ఫలముల శతపుష్పుడు దొంగిలించి పారిపోవుచుండ నే నతనిని బట్టుకొనినా నని మయూరుడు నాపై బడినాడు."

'అతడు దొంగిలించి పారిపోవుట నీవు కన్నులార చూచితివా?'

'చూచితిని. సుజాత యీఫలములు తనవే నని యంగీకరించినది. ఇంకను నొక కొన్ని యతని యొడిలో నున్నవి.

'అయిన బ్రహ్మాయువా! ఇతని యొడి వెతికింతము.'

"అతని పృథుపు మంగళుడు—అతనిచే వెదకింతము."

అతని నెవరు వెదకుటకైన శతపుష్పు డంగీకరింప లేదు. బ్రహ్మాయువు బలవంతముగ నతని యొడి వెదుక మని ధ్వజకేతువు నాజ్ఞాపించినాడు.

ధ్వజకేతు వతనిని బట్టుకొనినాడు. ఆదుష్టబాలకులు దానిని భగ్నమొనర్ప దలచి ముందుకు రెండడుగులు వైచినారు; కాని ధైర్యము చాలలేదు. స్వాతి యతని యొడిలో జేయవెట్టి ఫలముల బయటకు దీసినాడు.

"శతపుష్పా! నీవు దొంగవు. అసత్యవాదివి. నీవంటి వారున్న నాలంద కెంతటి యపకీర్తి?"

"ఇతని కేమి శిక్ష" యని బ్రహ్మాయువు విద్యార్థులలో నున్న పృథువుల జూచిపలికినాడు.

'ఏశిక్ష తరువాతి బాలకులకు పాఠము కాగలదో యట్టిశిక్ష నొసగుట యుచిత' మని శాతకర్ణి యభిప్రాయ మిచ్చినాడు.

'నిజము—ఉత్తరా! ఒక బెత్తమును దెచ్చిపెట్టుము.'

మంగళుడు ముందుకు వచ్చి 'నీకతనిని శిక్షించు నధికారము లేదు. అతనిని వెదకించుటయే తప్పు'—అనినాడు.

'అతనిని నే శిక్షింపదలచినాను. ఎవ రడ్డురాదలచినారో చూచెదను.'

'మేము' అని కొన్ని గొంతుకలు వినిపించినవి. వానిలో ఏకశృగ, కుశధ్వజుల కంఠములు విస్పష్టముగ వినిపించినవి.

'అయిన మీరు పశుబలముతో నన్ను ధిక్కరింప దలచినా రన్నమాట!' "ఔను" 'మంగళా! దానికి నీ వంగీకరింతువా?'

మైమరచి మంగళుడు 'అంగీకరింతు' ననినాడు. "శిక్షించుట నాకర్తవ్యము. దీని నెరవేర్ప నేను జంకువాడను గాను" అని బ్రహ్మాయువనినాడు. ఉత్తరుడు బెత్తముతో దిరిగి వచ్చినాడు.

ఏకశృంగుని పశుబలము నెదుర్కొన కాత్యాయనుడు నతని మిత్రులు సిద్ధపడినారు. మంజీరుడు, మహిముడు ప్రథువుల పక్షమున నున్నారు. ఒకపృథువు శతపుష్పుని వెనుకనిల్చి యతని హస్తమును దక్షిణముఖముగ చాచినాడు. బ్రహ్మాయువు మొదట దెబ్బ కొట్టినాడు.

ఏకశృంగుని పక్షమువాడు ముందుకు సాగివచ్చినాడు. వారి వెనువెంట మంజీర మహిములు కదలి మిత్రులతో వారిని హస్తముల బంధించినారు. మంగళుడు క్రోసుకొని ముందుకు వచ్చి బ్రహ్మాయువు పైబడ నుంకించుచున్న సమయమున బలిష్టములగు హస్తములతో వెనుకనుండి శిఖశాతకర్ణి యతని నటనుండి దూరముగ దొలగించి సకరుణముగ

“ మంగళా! నీవంటి మిత్రు నిట్లు బంధింప వలసి వచ్చినది. క్షమించు. లేకున్న ననవసరముగ నీజీవితము భగ్నము కాగలదు. కాలము గడచిన తరువాత నీవు న న్నభినందింతు” వని నాడు.

అతని కరుణాపూరిత వాక్యములు మంగళున కాశ్చర్యము కలిగించినవి. మూడుసంవత్సరములనుండి యొకనాటి తనయాప్తమిత్రు డాతని శరీర మెన్నడును స్పృశింప లేదు; ఒకమాట మాట్లాడలేదు. మంగళుని హృదయమున శాతకర్ణిపై నెంతో క్రోధ మున్నది. అత డనిన వైరము.

కాని యావాక్యములలో మంగళునికి గొంతసత్యము గోచరించినది. అత డేమియు వ్యతిరేకముగ మాటాడక లేక పోయినాడు; రంగస్థలమును వీడి వెడలినాడు.

మాంజిష్టునితో నెట్టి సంబంధము నైన బెట్టుకొనిన విద్యార్థుల కఠినముగ శిక్షించెదు నని శీలభద్రాచార్యు డనేక పర్యాయములు విద్యార్థుల హెచ్చరించినాడు. ఏకశృంగ, కుశధ్వజ, విజితాపు లాయాచార్యుని వాక్యముల గౌరవించుట లేదు. అందువలన నాచార్యు డొక విద్యార్థి సభగావించి వారిని నలందా విద్యాలయావరణమునుండి నిష్కరుణముగ బహిష్కరించినాడు. పిమ్మట నొకనాడు మంగళు 'నేకాంతముగ సంభాషింప ర' మ్మని బిలిపించి ప్రథమమున నతని దుష్టసాంగత్యమును తెగడి చీవాట్లు పెట్టినాడు. విద్యార్థి లక్షణములను, జీవితాదర్శస్వరూపము నటుపిమ్మట ననురాగముతో నతని కవగత మగునట్లు గంభీరముగ ప్రబోధించినాడు. ఆనాటి సంభాషణమును శీలభద్రాచార్యుని యౌదార్యమును జీవితాంతము వరకును మంగళునకు మరపురాలేదు.

ఆయాచార్యుడు సంభాషించువేళ మంగళుని నోట మాట రాలేదు; వంచిన శిరము నెత్తలేదు. మనస్సు నానావిధ భావ పరంపరలకు నిలయమైనది.

"నాహృదయము నిత్యము నీశుభజీవితము నాకాంక్షించుట వలన నేను నిన్ను నాలందనుండి బహిష్కరింప లేదు. వ్యక్తిగతముగ నీకు నాపై గౌరవ మున్నదని నే నెఱుగుదును. నీ యెడ నాకున్న యనురాగము కొంతకాలమునుండి సడలినది. మరల నీకు దానిని నే ప్రసాదించుచున్నాను. కాలమును వ్యర్థపుచ్చకుము. నీవు పృథుపు వని నిరంతరమును మఱచిపోకుము. నీకర్తవ్యపాలనముపై నితరవిద్యార్థుల జీవితములు, నాలందా

విద్యాలయ కీర్తిప్రతిష్ఠలు నిలచి యున్నవని గుర్తెరుంగుము. నీ దుష్ప్రవర్తనమును దిద్దుకొనుట కీ సదవకాశమును కనికరించి నాచే నిష్క్రమించినందుకు భగవానుని భక్తిని సేవింపుము. నిన్ను పృథుపులలో తుదివానిగ నొనర్చినాను. నీశీలమును మఱల కొంతకాలము పరిశీలింప వలసియున్నది. పొమ్ము" అని శీలభద్రాచార్యుడు మంగళుని పంపించినాడు.

ఆచార్యు డతనిని 'తుది పృథుపుగ' తగ్గించినాడు. పృథుపులు సభచేసి త న్ననుమానించు చున్న శ్లోక తీర్మానము గావించినారు. దానిపై శాతకర్ణి స్వహస్తము లేదు. మంగళుడు తన పతనమును గుఱించి చింతింప నారంభించినాడు. శాతకర్ణి తీర్మానముపై సంతక మెందుకు పెట్టలేదు? వారిరువుర స్నేహచరిత్ర యొకమారతని కన్నులముందు శరవేగమున గదలి పోయినది. అతని కన్నుల నీరు క్రమ్మినది. 'నే నెట్టి మిత్రుని స్వదోషమున గోల్పోయినా' నని చింతించినాడు.

కుబ్జు డతని నివాసగృహములో బ్రవేశించి "ఇదుగో—నీవు మన బుద్ధవాదముల కడ నీ 'పాణినీయ శిక్ష' మఱచి పోయినా" వని యతనిచేతి కా గ్రంథము నందించినాడు.

"ఆగ్రంథము నాదే. దీనిని నే నిప్పుడు పోగొట్టుకొనలేదు; బహుకాలమైనది." 'సత్యము చెప్పనా? నేను నీతో మాటాడ దలచి యిట్టి యవకాశమును గల్పించుకొనినాను.'

"తప్పక మాటాడుము."

"నీ గృహ సిద్ధాగ్ర్యముల ననేక విద్యార్థులకు శాతకర్ణి చెప్పినాడని నీతో జెప్పి విజితావి నమ్మించినాడు. పాపము!

శాతకర్ణి యేమియు నెఱుగడు. అతడనిన గిట్టక నీవతనికి దోడ్పడు చున్నా వని మీా యిరువుర జీలదీయ నిట్టి పన్నాగము బన్నినాడు."

"విజితావి నాతో నసత్యమాడునా? అయిన నా గృహ స్థితు లతనికెట్లు తెలిసినవి. శాతకర్ణివలన దప్ప మఱియొక రీతిగ నవి బయట బడుటకు వీలులేదు. అతడు బ్రహ్మ్యాయు వుకు దప్ప నెవ్వారికిని జెప్పలేదని వెనుకయనినాడు. అతడే యసత్య మాడియుండు" నని మంగళుడు నిశ్చయముగ బలికినాడు.

'శాతకర్ణి యతని జీవితమున నసత్య మెఱుగడు. విజితావికి మీా గ్రామమున దూరబంధువు లున్నారు. వారివలన నతడు నీ స్థితిగతుల దెలుసుకొనినా నని నాతో జెప్పినాడు.'

'ఓరి దుష్టుడా!' అని మంగళుడు డప్రయత్నముగ ననినాడు. 'కుబ్జా! ఇన్ని దినములు నేనొక మూర్ఖునివలె బ్రవర్తించినాను. అమృతమూర్తి నాప్రియమిత్రుని శిఖని దూరమొనర్చుకొనినా' నని యతడు చింతించినాడు.

'కాల మనంతము. మరల మీా మైత్రి యథాక్రమముగ పూర్వరూపము నొంది వర్ధిల్లుగాక' యని కుబ్జుడు వెళ్ళిపోయి నాడు. భోజనానంతరము మయూరుడు నివాసగృహమునకు దిరిగి వచ్చువేళ మంగళుడు తీక్ష్ణముగ నతని 'పాణినీయశిక్షా' గ్రంథమున ప్రథమపత్రముపై నున్న నొక రచనపై దృష్టి నిల్పి మరలమరల జదువుకొనుచున్నాడు. అది మిత్రుడు

శిఖశాతకర్ణి వ్రాసిన క్షమాపణలేఖ. అందు ప్రత్యక్షరమున మిత్రుని యమృతహృదయము చిందులాడుచున్నది. మంగళుని మానసము చలించిపోవుచున్నది.

మంగళా! యని మయూరుని పిలుపు వినిపించినది. 'ఇది యెంతటి శుభదిన' మను పరిశుద్ధభావముతో గ్రంథమును చుట్టిపెట్టి యతని వైపునకు తల ద్రిప్పినాడు.

౧౭

ఒకానొక సమయమున నుత్తమ పృథువులలో నొక డని పించుకొనిన మంగళునకు నేడు టుదిపృథువుగ వర్తించుటకు మొగము చెల్లుటలేదు. మిత్రుడు శాతకర్ణి యాత్మీయతతో వ్రాసిన లేఖ చదివి బాధపడినాడు. అతడు తనహృదయ కోశ మతనికి గలుసుకొని విప్పి యొప్పజెప్పుటకు సిగ్గుపడుచున్నాడు. కొంతపరివర్తన గలిగినది గాని వెనుకటి మిత్రుల వంత తర్వాత ముగ దూరమొనర్చుకొన లేకున్నాడు.

శాతకర్ణిని గురించి సంభాషణలలో నతడు విశేష గౌరమును ప్రకటించుట కొందరు దుష్టమిత్రుల కాశ్చర్యము గలిగించినది. వక్తృత్వవేళల శిఖి యభిప్రాయములతో నేకీభవించి యతడు ప్రసంగింప నారంభించినాడు. దుష్టవిద్యార్థుల శిక్షించు పృథువుల నీర్ష్యాదృష్టితో జూచుట మానినాడు. నే డతని మానసమున నెవ్వరిపైనను ప్రతీకారవాంఛ లేదు. సమస్తము నత డొక పతన మొందిన పీరునివలె భావించి భరించుచున్నాడు.

ఒక సందర్భమున నతనిపై పృథుపు లోనర్చిన కీర్త్యానమును గురించి విద్యార్థిసభలో" మిత్రులారా! మీకెంత వ్యక్తి రేకముగ నున్నను నేను పృథుపుల కనుకూలముగ మాటాడి నిశ్చయించి నాను. నాకంటె ముందు వేదికపై కెక్కి ప్రసంగించిన 'మిత్రుని' యని యప్రయత్నముగ శాతకర్ణిను ద్దేశించి వచ్చిన యాపదమును మరల దిద్దుకొని 'పృథుపు' స్వహస్తము లేకుండుట గమనించినాను. నాహృదయమున నూతన పరివర్తన మారంభమైనది. నేను మీయెదుట బహిరంగముగ బలుక నవసరము లేదు. కాని పృథుపు లొసగిన శిక్షను నే బాత్రుడ ననియే నానిశ్చయము. కొందఱు నన్ను తప్పుత్రోవల నడిపించినారు. నాపూర్వవృత్త మును మఱచి క్షమింపు డని పృథుపుల వేడుకొనుచున్నా" నని ప్రియపూర్వకముగ మంగళుడు పలికినాడు.

'ఆనాడు మంగళుని మాటలను విన్న ప్రతివిద్యార్థియు నతని మెచ్చుకొనినాడు. బ్రహస్మియుడు లేచి 'సోదరులారా! నేడు మీముందు నిలచి మాటాడిన వ్యక్తి వాక్యము లుదాత్తములు; గౌరవప్రదములు. నేను పూర్వపత్రికను నిరర్థకమొనర్చి మఱీ యొక పత్రికను వ్రాసి యతని కందించుటకు మీరు మా కనుజ్ఞ నిండు' అని వేడుకొని వారి యేకగ్రీవమైన యంగీకారముతో మంగళునకు నూతన గౌరవ పత్రిక నంపినాడు

మంగళు డొకపరి యేకాంతముగ శీలభద్రాచార్యుని నివాస గృహమున కేగి గడచిన నాల్గుమాసములలో నతని జీవితవిధా నము నంతయును బూసగ్రుచ్చినట్లు నివేదించి కనికర మర్థించి నాడు.

అతడు నాలందలోని యుత్తమ విద్యార్థి వేతనమును స్వీకరించుటకు విశేషకాలము నేడు శ్రమించుచున్నాడు. అది లభించినచో నతని విద్య పరిపూర్ణము కాగలదు. మిగిలిన విద్యార్థి వేతనము లన్నిటికంటె నిది విలువ యైనది. పేదవాడైన మంగళుడు దానిని స్వీకరించుటకై కృషియొనర్చుట సముచిత కృత్యము.

పరీక్షలైనవి. కాని ఫలితాంశములు వెలువడలేదు.

బుద్ధజయంతికి సెలవలు వచ్చినవి.

సునీథాదేవి మంగళునితో మరల సంతోషముగ గొంత కాలము గడుపవచ్చునని యాశపడుచున్నది. అతని లక్షణము లలో గొంతమార్పు గలిగి నూతనవ్యక్తిగ వచ్చునని యామె యువ్విళ్ళూరుచున్నది. మంగళుడు గృహమునకేగి మాతృమూర్తిని సర్వవిధముల సంతోష పెట్టినాడు.

మరల విద్యార్థులు నాలందకు దిరిగివచ్చిన వెనువెంటనే వేతన పరీక్షా ఫలితాంశములు వెలువడినవి. శీలభద్రాచార్యులు వానిని క్రిందినుండి పైకిచదివినాడు. ధ్వజకేతువు నాల్గవవాడు. మంగళుడు మూడవవాడు. శాతకర్ణి ద్వితీయుడు. బ్రహ్మయువు ప్రథముడు. బ్రహ్మయువు నా కా వేతన మవసరము లేదనినాడు. అందువలన నది శాతకర్ణి దైనది.

కొంచెము మాశాభంగము వాటిల్లినను దానిని లెక్కింపక మంగళుడు నివాసగృహమునకు దిరిగివచ్చి గ్రంథపఠన మొనర్చుచున్నాడు. అట్టిస్థితిలో " మంగళా !" యను మధురమైన శిఖి శాతకర్ణి గొంతు వినిపించినది. ' శాతకర్ణీ ! ' యని యాశ్చర్యో

ద్వేగములతో లేచి యెదురువచ్చి యతనిని యుచితస్థానమున సగౌరవముగ మంగళుడు కూర్చుండబెట్టినాడు.

"మనము బహుకాల మిత్రులము. తాత్కాలికముగ గొంతకాలము మన మొకరొకరికి దూరముగ నున్నాము. నాహృదయమున నీపై నెట్టి విరోధ భావమును లేదు. ప్రస్తు తము నీయనువర్తనమును బరికించిన నీమానసమును స్వచ్ఛమని మని నేను భావించుచున్నాను.

"నీకు నే నపకార మొనర్చినాను. నన్ను ప్రథమమున క్షమింపుము."

"క్షమించుట కేమైన నున్న నట్లే. వైమనస్యము వలన మన మిరువురమును యెడబా టను శిక్ష నొందినాము."

"ప్రస్తుతము నేనొక ప్రత్యేక కార్యమునకై వచ్చినాను. ఈ విద్యార్థి వేతనము వలన నీకేమైన విశేష ప్రయోజన మున్నదా!" యని శాతకర్ణి ప్రశ్నింప మంగళుడు దానికి సమాధాన మీయలేదు.

"నేను నాలందలో మరియొక వత్సరముందును. నీ వుండె దవా?"

"లేదు. దానికి దగిన ధనము నాకు మాతల్లి యిచ్చెడు స్థితిలో లేదు."

"మేము ధనికులము. మాతండ్రి మమ్ముల జదివింప గలడు. నాకు దక్కిన విద్యార్థివేతనమును స్వీకరించుట కేవలము స్వార్థము. అందువలన బ్రహ్మోత్సుకువు విడిచిపెట్టుట వలనను ఆ వేతనమును నీవు గ్రహింపుము."

శాతకర్ణి వాక్యములు మంగళున కాశ్చర్యము గలిగించినవి. ఆ త్యాగబుద్ధి మున్నెన్న డాతడు చూడలేదు. విన నైన లేదు. మిత్రుడు గ్రహించుట యాతనికి వేయిరెట్లానందమట! అతడు లేచి చిరునవ్వుతో పోబోవు సమయమున నతనిని చేయిబట్టు కొని మంగళుడు 'శిఖీ! నీయౌదార్యముతో నన్ను విక్రయించు కొనినావు. నేను బ్రతిక్రియగ నే మొనర్పగలనో యర్థమగుట లే' దనినాడు.

మిత్రులమధ్య ప్రతిక్రియల ప్రసక్తి లేదు. ఇకముం 'దెన్నడును మనము దూరదూరముగ నుండరాదు. బ్రహ్మయువు సాయం సమయమున పచ్చికభయళ్లకు వాహ్యాళి కేగుద మనినాడు. నీవును మాతో వచ్చుటకు సిద్ధపడుము.' అని శిఖి వెడలినాడు.

శిఖి తన నివాసగృహమును దాటిన తరువాత మంగళుడు పొందిన యానందమునకు మేర లేదు. అతనికి వేతనము లభించి నది. చెడిన స్నేహము మరల సుస్థిర మైనది. ఈవార్తల దెలియ పరచుచు నతడు తల్లికొక లేఖ వ్రాసినాడు. కనబడిన మిత్రుల కెల్ల జెప్పినాడు.

ఇట్టి సంతోష, సమయమున నతని కొక లేఖవచ్చినది. అందలి యక్షరము లస్తవ్యస్తములుగ నున్నవి. అది యెవరి లేఖనమో యతడు గుర్తుబట్టలేదు.

"హృద్రోగము కారణముగ మీతల్లి మంగళవారమునాడు మరణించినది." అతని పిన తండ్రి యీలేఖ నెవరిచేనైన వాయించి యుండవచ్చును.

మంగళుడు నిలువెల్ల క్రుంగి కూలబడినాడు. శాతకర్ణి యొద్ద కతడు పూర్వము పంపిన విద్యార్థి సమాధానముతో దిరిగి వచ్చువర కతడట్లే యున్నాడు.

శిక్షు తాను పంపిన సమాధానమును మంగళు డెట్లర్థ మొనర్చుకొనునో యను భయమున వెనువెంటనే యటకు వచ్చెను. మంగళు డింటినుండి వచ్చిన లేఖ నతని చేతికందింప, నతడు చదివి మిత్రునికి గలిగిన కష్టమునకు నిశ్చేష్టుడైనాడు. మరల తెలివి దెచ్చుకొని మంగళునకు రోదింపవలదని సమస్తవిధ ముల ధైర్యము జెప్పి యోదార్చెను.

మంగళుడు తల్లి కంత్యక్రియలు గావింప నాచార్యుల యను మతితో బ్రహ్మయువు, శాతకర్ణి యొసగిన ధనసహాయముతో స్వగ్రామమునకు పయనమైనాడు.

## ౧౮

అంత్యక్రియలు పూర్తిగావించి మంగళుడు మరల నాలందకు బయలుదేరువేళ నతని పినతండ్రి "నీవిక బహుకాలము విద్యార్జన మొనర్చుట కవకాశ ముండదు. మీకుటీర మమ్మిన వచ్చునది స్వల్పము. నేనెటనైన నీకు దగిన యుద్యోగ మొక ధనికునియొద్ద జూచెదను. దానితో నీపొట్ట పోసుకొన వచ్చు' నని చెప్పినాడు.

అతని యాశలు సమస్తమును దాకుమారైనవి. దుఃఖము పొంగిపొరలివచ్చినది. నాలందకు వచ్చిన తరువాత ఒంటరిగ

గ్రంథపఠన మొనర్చుట యేకాంతముగ వాహ్యాళికేగుట దప్ప నితరక్రియ లేవియు నతనికి రుచించుట లేదు. చదివిన నర్థ మగుట మానినది; ఆటపాటలలో నాసక్తి శూన్యమైనది.

బ్రహ్మాయువు, శిఖి శాతకర్ణి యతని దుస్థితిని గురించి పలు మారులు ప్రసంగించుకొనినారు. ఒకమాసము గడచినది. మంగళుని ముఖమున దైన్య మధికమగు చున్నది గాని లోపించుట లేదు. బ్రహ్మాయు వతని దుస్థితిని గురించి శీలభద్రాచార్యుని యేకాంత గృహమున కేగి నివేదించినాడు.

కరుణతో శీలభద్రాచార్యుడు మంగళు డెట్లు కృశించు చున్నాడో పరీక్షించినాడు. 'మన మంగళుని నిరాశ యొక మహావ్యాధి వలె పట్టుకొని నట్లున్నది. అతడు నిన్న నాతో నొకవాక్యమైన పూర్వమువలె బలుక లేకపోయినాడు. అతనికి జీవితమున నెందును సంతోషము కన్పించుట లేదట! అతని నెట్లైన నొంటరిగ దిరుగ నీయక మీరె వెను వెంట సంచరింప జేయు' డని బ్రహ్మాయువుతో నాచార్యుడు బలికినాడు.

"నేను, శాతకర్ణి, కేతుధ్వజుడు నెంతో యత్నించినాము. మా తరముగా లేదు. అతడు మమ్ము జూచిన తప్పుకొని తిరుగు చున్నాడు. అతడు సంవత్సరానంతర మింటికి బోయి ధనికునింట నొక యుద్యోగివలె నుండుటను గురించి బెంగపెట్టుకొని నట్లున్నాడు.

"అతని దుస్థితి కదే కారణమైన కష్టము లేదు." అతని పిన తండ్రి ధనమీయకున్న నతడిచ్చట నెన్నాళ్లైన విద్యనేర్చుకొన

వచ్చును." నాలంద యర్థులకు విద్యాదాన మొనర్చుట కేర్పడిన మహాసంస్థ అని శీలభద్రాచార్యులవా రనినారు.

శాతకర్ణి యీశుభవార్తను మరుక్షణము మంగళునికి జేర్చినాడు. ఆవార్త వినిన మరుక్షణమున మంగళుని దీనముఖమున నాశారేఖ యొకటి నర్తించినది. కొలదికాలము తరువాత నొక సంస్థానాధీశ్వరు డొక విద్యార్థి వేతనము నేర్పాటు జేయించినాడు. అంతటి వేతనము మునుపు నాలందలో లేదు. ఈ వేతన మెవరిచ్చినా రని దెలుసుకొన నాలందలో ప్రతివ్యక్తియు కుతూహలముతో నున్నారు. అట్టి వేతనము తండ్రితో జెప్పి నిప్పించిన వాడు బ్రహ్మయువు.

అయినను మంగళుని మానసిక స్వాస్థ్యము చేకూరలేదు. మరల నాలోచనాపరవశతతో నేకాంతముగ దిరుగుచున్నాడు. అప్పు డప్పు డతని కాత్మహత్య యొనర్చుకొన వలె నను నూహాలు జనించినవి. అతని ప్రయాణముల కొక నియమము లేదు; నిశ్చయము లేదు; నిర్ణయమును లేదు.

మరుసటినెలలో కంటకశైలమునకు నాలంద విద్యార్థులు విహారయాత్ర కేగ నిశ్చయమైనది. సమస్త సన్నాహములు నేర్పాటైనవి.

విద్యార్థు లందరును సంతోషమున కేలింతలు గొట్టుచు శిబికలలో వాహనములపై రథములపై యీపర్వత పాదప్రదేశమున కేగుచున్నారు. మంగళుడును, వారిలో నున్నాడు. పూర్వ మాత డట నొక యున్నత శిఖర మధిరోహించి యొక రమ్య

దృశ్యమును జూచినాడు. అట తనకు ప్రశాంతి లభించు నను కొనుటయే నే డతనిరాకకు కారణము.

కంటకశైల పాదప్రదేశమును జేరి విద్యార్థులు భోజనాదిక ముల బూర్తిగావించుకొని పర్వతారోహణ మారంభించినారు. మంగళుడు కొంతదూరము వారి ననుసరించి ప్రక్కదారిని బట్టి తప్పుకొని యాతడనుకొనిన శిఖరమార్గమును బట్టి పోవు చున్నాడు. అతని నెవరును గమనింపలేదు.

సాయంత్రము వరకును విద్యార్థులు పర్వత శిఖరముపై నాటపాటలతో గడపినారు. సూర్యాస్తమయవేళ వారు మరల దిగి రావలసి యున్నది. అందరు నున్నారు. మంగళుడు కనుపింపలేదు.

మంగళుడేడి ? యన్న ప్రశ్న విద్యార్థినుండి విద్యార్థికి ప్రాకినది. మంగళుడేమైనాడు ?

మంగళుడేకాంతముగ నుండగోరిన శిఖరమునకు దీసు కొనిపోవు దారిదప్పినాడు. ఆపర్వత శిఖరముల నెక్కుచు దిగుచు నడచినాడు. ఎంత నడచిన నత డనుకొన్న శిఖరము గనుపింప లేదు. కాని యంతకంటె నొక యున్నత శిఖరము పొడకట్టినది. అటనుండి యొక కొలను కన్పించినది. ఒక శిఖరము నెక్కి దానికడ కేగవలెను. ఆరంభించినాడు. మార్గ మతి కఠిన మైనది. పాదములు జారిపోవుచున్నవి. అష్టే ప్రాకి శిఖరతలమును జేరినాడు. బహుకాల మట ప్రశాంతముగ గూర్చుండి కమలాకరమును దర్శించినాడు. సూర్యాస్తమయము

వేళ నరుణ కాలములలో నా సరోవరమతి రమ్యముగ నతని హృదయ మాకర్షించినది. ఎంత జూచిన నతనికి తృప్తి కలుగ లేదు.

మంగళుని వెదకుచు 'పృథువులు' శిఖరములపై కెక్కి— "మంగళా ! మంగళా ! !" అని కేకలు బెట్టుచున్నారు. వారి పిలుపు చెవినబడినది. తాము తిరిగి నాలందకు బయలుదేర వలసిన సమయము దాటినదని యతనికి స్ఫురణకు వచ్చినది.

మంగళుడు శిఖరమును దిగుట కారంభించినాడు. మార్గ మతిక్లిష్టముగ నున్నది. చినికినందువలన బాదములు జారి-పోవుచున్నవి. ఒకమారు కాలుజారి కొండరాయి యొకటి యడ్డుట వలన నాగగలిగినాడు.

మార్గమేమియు దోచక మరల పైకెక్క నారంభించినాడు. శిఖరముపై నిలచుటకైన నవకాశము లేదు.

ఒకవంకనుండి మేఘములు దట్టముగ గ్రమ్ముకొని వచ్చినవి. వర్ష మారంభ మైనది. గాలి యాపాదమస్తకమును గదల్చి వేయుచున్నది.

'మంగళా', 'మంగళా' శిఖి పిలుపుతో బర్వతములు ప్రతి ధ్వనించుచున్నవి.

ప్రాణములపై నాశ వదలుకొని మంగళుడు సరోవరముపై దృష్టినిల్పినాడు. ఒక తామరతూడు మరల మరల గాలినెదిర్చి నిల్చుచున్నది. ఆదృశ్య మతని కొక పాఠము నేర్పినది. మరు క్షణమున నతడు కమలాకరమున దుమికి యీదనారంభించినాడు.

దూరమున నావలిగట్టుననున్న శిఖరమున నొక త్రాటిపై శిఖి శ్రీముఖుడు, ధ్వజకేతువులు దిగుచున్నారు. 'అదుగో! మంగళుడు మసల జూచి యీదివచ్చుచున్నట్లున్నాడు. 'లోతుకు భయపడ నవసరములేదు. కాని గాలి యతనికి వ్యతిరేకముగ నున్నది. అతడు పూనుకొనినది సాహసకృత్యము' అని శాతకర్ణి యనినాడు.

'చిన్న తెప్పకొయ్య యున్న నెంత బాగుండును? ఇందు చేపలుపట్టు పల్లెవారు దాని నీప్రాంతమున నుంచి యుందురు. దానిని నేను నడుపుచు నెదురేగి యతనికి సాయమొసర్ప గల' నని శాతకర్ణి పలుక శ్రీముఖుడు, ధ్వజకేతువు వెదకుచున్నారు.

అదృష్టవశమున తెప్పకొయ్య కనుపించినది. కాని తెడ్లు లేవు. పల్లెవారు దాచియుందురు. కృత్రిమమగు తెడ్లు త్వరితముగ నేర్పాటు జేసుకొనినారు. శాతకర్ణి శ్రీముఖుని తోడు దీసుకొని నీరమున ప్రవేశింప సిద్ధపడినాడు.

కొండలోయలు పర్వతములు బ్రద్దలగునట్లు రొదపెట్టు చున్నవి. జంఝామారుత మాగునట్లు లేదు. వర్షము పెద్దదగుచున్నది.

సరస్సును మంగళుడు సగ మీదినాడు. బాగుగ నలసిన ట్లున్నాడు. అల లతనిని వెనుకకు దరుముచున్నవి. నిస్పృహ ప్రారంభమైనది. వెనుదిరిగి యనుకూల వాతమొసర్చు సహాయమున బయలుదేరిన స్థలమునకు జేర దలచినాడు. ఒక మూల నుండి వేగముగ నది యొకటి యాసరస్సులో చొచ్చువడుచు నట నొక కల్లోలినివలె నున్నది.

వర్షము వెనుకబట్టినది. 'మంగళా' యను పిలుపు వినిపించి ది. ఎదురుగ నెవరో యీదుకొనుచు వచ్చుచున్నారు. మంగళుడు ధైర్యముతో మరల ముందుకు వచ్చినాడు.

గాలి యనుకూలమున నుండుట వలన శాతకర్ణి తెప్ప మును గుట వలన నొకదుంగతో నీదుచున్నాడు. శ్రీముఖుడును దానిపై కూర్చున్నాడు. "సోదరా! భయపడకు."

"అన్నా ! నీవున్న నాకేమి భయము? "

మంగళునికి జేతులు కాళ్లు తేలిపోవుచున్నవి. ఇంతలో నొక కొండకోననుండి సరస్సులోనికొక నూతన ప్రవాహ మతివేగ ముగ వచ్చిపడినది. ఇరువురకును పదిగజములదూర మున్నది.

మంగళుడు "మూర్ఛితుడైనాడు. నోటమాట లేదు" — మంగళా' యన్న పిలుపుకు సమాధానము లేదు." —

మనయత్నమంతయు నిష్ప్రయోజనమా ? మనస్సులో భగవానుని ప్రార్థించి మరల వేగమధిక మొనర్చినాడు. దుంగతో మంగళుని చేరినాడు. కాని యతడు స్వశక్తితో దానిని గ్రహించి యెక్కివచ్చు స్థితి లేదు. శ్రీముఖుడును నీరమున దిగినాడు. నిరువురు క్రమముగ నతనిని దుంగపై నెక్కించి పడిపోకుండ వస్త్రములతో బిగించి తిరిగి యెదురీద నారంభించినారు.

"శ్రీముఖా! మంగళునిపై దృష్టి నిలుపవద్దు. ముందు జూచుచు నీదుము."

"అన్నా ఇకనైన వర్ష మాగిన నెంత బాగుండును?"

"భగవానుని బ్రార్థింపుము."

వర్షము క్రమముగ వెనుకబట్టినది. గాలి యింకను నున్న యున్నది. కొందఱు విద్యార్థులు శిఖి, ధ్వజకేతువుల వెదకుచు నటకువచ్చి సమస్తమును దెలుసుకొనినారు. శ్రీముఖుని శక్తి యైపోయినది. శిఖి యతిసనిగూడ దుంగపై నెక్క మనినాడు. ధ్వజకేతువు నితరమిత్రుల యుత్సాహజనక వాక్యము లతనికి వినిపించినవి.

ప్రాణము లుగ్గబట్టుకొని యతి డీదుచు దుంగను ముందుకు నడిపించుకొని వచ్చుచున్నాడు. గట్టు కొన్నిగజముల దూరమే యున్నదని గ్రహించి శ్రీముఖుడు మరల దిగి స్వయముగ నీదు చున్నాడు.

"మేలు! మేలు!! శాతకర్ణి మేలు!! హర్షధ్వనులు విని పించినవి.

మంగళుని గట్టుజేర్చు నప్పటికి శిఖిశాతకర్ణికి స్మృతితప్పినది.

## ౧౯

గయాశీర్షుని స్థానమున నుపాధ్యాయ పదవిని స్వీకరించిన మహాద్గల్యాయనుడు శిఖిశాతకర్ణి ప్రభృతులకంటె ముందుగ కంటకశైల పాదదేశమును చేరుకొన్న కొలదిమంది విద్యార్థు లతో నాలంద జేరుకొని జరిగిన యుదంత మంతయు శీలభద్రా చార్యులకు విన్నవించినాడు.

ఆయన మనస్సు మనస్సున లేదు; ద్వారముయొద్ద నిలచి వెనుకబడిన విద్యార్థులరాకకై యాతురతతో జూచుచున్నాడు.

శాతకర్ణి తల్లి యొకమారు కుమారుని జూచిపోవుదమను కోరి కకో వచ్చి సంగతి దెలుసుకొని యాచార్య్య ననుసరించి ద్వార ముకడ నిలచి వ్యాకులత నొందుచున్నది. కన్నీరు మున్నీరుగ నేడ్చుచున్నది.

"అమ్మా! భయపడ నవసరములేదు. శిఖి యసామాన్యుడు. మంగళునితో బయలుదేరి వచ్చుచుండును. చింతింపకు" మని బ్రహ్మీయు వామెకు ధైర్యము జెప్పుచుండెను.

దూరమున అమితాభు డేకాంతముగ దిరిగి వచ్చుట నందఱు గమనించినారు. ఏమో ప్రుట్టిమునిగి నట్లున్నది? లేకున్న నితడొంటరిగ వచ్చుట యేల? శాతకర్ణి తల్లి బిట్టుగ దుఃఖింప నారంభించినది. శీలభద్రుడు కళవళ పడుచున్నాడు.

వారు క్షేమముగ నున్నారు. అతిగ నలసిపోవుటవలన స్మృతిదప్పినది. ప్రక్కనున్న గ్రామమునందలి యాపథ శాలలో నున్నారు. అందఱును రేపటి సాయంత్రమునకు బయలుదేరి రాగలరు.' అని అమితాభుడు వారి కెరుకపరచినాడు.

శాతకర్ణి మంగళునితో న్నాలంద జేరి యాచార్యపాదుల కభివందన మాచరించి తల్లి యొడిలో నొదిగినాడు. ఆమెకు మంగళుని బరిచయ మొనర్చినాడు. 'ఇతని నామము నాకు సుపరిచితము.' బ్రహ్మీయువును జూపించుచు 'ఇతడే నాకు ధైర్యము జెప్పి ప్రాణముల గాపాడినాడు' అని యామె పలికినది.

ధ్వజకేతువు విద్యార్థిలోకమునకు శాతకర్ణి వీరకృత్యమును జాటినాడు. శీలభద్రుడు ప్రత్యేకముగ సభనేర్పాటు జేసి

యందతని వీరకృత్యమును బొగడి 'విద్యార్థివీరు' డని బిరుదమిచ్చి నాలంద చిహ్నముతో నున్న పతకమును బహూకరించినాడు. విద్యార్థు లతనికి జయవెట్టి యుత్సవమొనర్చినారు.

మంగళుడు నూతనవ్యక్తిగ మార్పునంది శాతకర్ణి యభినందన సభలో నొక గంభీరోపన్యాస మిచ్చినాడు. శాతకర్ణి తన్నెందుకు రక్షించినాడో యతని కవగతమైనది. సమస్త సత్త్వాత్మ్యముల మిత్రుని కండగనిలచి యతడు నిర్వహించినాడు.

అభినందన సభలో 'నాలందపాలన విద్యార్థుల పరమొనర్చుచున్నా' నని శీలభద్రాచార్యుడు పలికినాడు. 'ఆభారమును నిర్వహించి మీమన్ననల బొందగల' మని శాతకర్ణి యాచార్యునకు విద్యార్థుల పక్షమున 'ప్రథమ పృథువు'గ బలికినాడు. గయాశీర్షోపాధ్యాయుడు తనపై జూపిన క్షమయే యతని జీవితమును దిద్దిన దని వేనోళ్ళ నతడు జాటినాడు. ఆక్షమయే మంగళుని శాతకర్ణి ప్రబోధించుటకు గారణమైనది.

'నాలందయే మాసమస్తము. దానివిఖ్యాతి మా యుత్తమ శీలమున లోకమునవెల్లడింప బద్ధకంకణుల మైనాము.' అని శిఖ నాయకత్వమున విద్యార్థులు ప్రమాణపత్రముల స్వీకరించినారు. శీలభద్రాచార్యుడా నా డొందిన యానందమునకు మేరలేదు.

శాతకర్ణి, బ్రహ్మాయువు, ధ్వజకేతువు, మంగళు లాదర్శ విద్యార్థులై నాలందలో జీవితమును గడపినారు. ఆశయమున కనుగుణముగ నాలందఖ్యాతి విశ్వవిఖ్యాత మైనది. ఆచార్యుల సహాయమున వా రేర్పాటుగావించిన జీవితవిధానములు లోకరంజకములైనవి. విద్యావిధానమును గొలదిగ మార్పునొందినది

నాలంద చరిత్రలో మరల నొక నూతనాధ్యాయ మారంభించి నవా రా నలువురు విద్యార్థిభిక్షులు ! వారి నాయకత్వమున శిక్షణవిధానము నూతనమార్గము ననుసరించినది; విశాల దృక్పథము ప్రాపించినది. కేవల బౌద్ధధర్మములుగాక సమస్తము లైన యుత్తమధర్మముల శిక్షణ కందు తావుకల్పితమైనది.

అనతికాలములో నావిద్యాలయము ఫాహియాన్, ఇత్సింగుల వంటి విదేశయాత్రికుల నాకర్షించినది. విదేశవిద్యార్థులు వేనవే లచటికి వచ్చి విద్యార్జనమొనర్చి జ్ఞానులై స్వదేశముల కేగుచున్నారు. విక్రమాదిత్య, శక్రాదిత్య, బుద్ధగుప్త, తథాగత గుప్తాది రాజన్యులు వైషమ్య విరహితముగ నపరిమిత దానముల నావిద్యాలయమును బోషించి పెంపొందించినారు. ఆచార్యుల కమ్మని కంఠము లంటు పిమ్మట నాయిశతాబ్దుల కాల మిట్లు వినిపించినవి.

'సమస్త నదులెట్లు సాగరమును జేరుచున్నవో యట్లు విద్యార్థులు నలుదెసలనుండి నాలంద చేరుదురుగాక ! ప్రశాంత కాసారమున శిలాఖండ పతనముచే వ్యాపించు తరంగములవలె దశదిశలకు విద్యార్థులు జ్ఞానముతో నాలందనుండి తరలుదురుగాక!'

---

ది ఓరియంటల్ పవర్, ప్రెస్, తెనాలి. కాపీలు 500—తేది 7-7-50